శ్రీ

# పాండవాజ్ఞాతవాసము

గ్రంథకర్త:

చెఱకుపల్లి వేంకటరామయ్యగారు.



పబ్లిషరు:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీబుక్‌డిపో, బెజవాడ.

రాజమహేంద్రవరమున

శ్రీరామముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

1932



[వెల 0-12-0.

# ఈ నాటకము నందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

ధర్మ, భీమార్జున నకుల సహదేవులు.

విరాటుఁడు.

సింహబలుఁడు.

దుర్యోధనుఁడు.

భీష్ముఁడు.

ద్రోణుఁడు.

కృపుడు.

అశ్వత్థామ.

కర్ణుఁడు.

శ్రీకృష్ణుఁడు.

కేశవశర్మ.

నారాయణుఁడు.

మాధవుఁడు.

ఉత్తరుఁడు.

వృద్ధకంచుకి.

ధౌమ్యులు, మఱికొందరు బ్రాహ్మణులు.

కంకుభట్టవలల, బృహన్నల, దామగ్రంధి, తంత్రీపాలులు.

## స్త్రీలు.

ద్రౌపది.

సుదేష్ణ.

యశోలత.

ఉత్తర.



శ్రీరస్తు.

శ్రీశారదాంబాయనమః

# పాండవాజ్ఞాతవాసము.



## నాంది

చ. ఒకనికిమేలొనర్చి మరి । యొక్కని గీడునరించి సర్వదా
సకలమునందునిల్చియుచు । సాక్ష్యము గాక నకుంఠితస్థితిం
యక చరియించుచుండి దర । హాసము మీర జగంబు బ్రోచు ఘ
పురుషుని ప్రేమతోడ నిడు । పూర్ణమనోరథ మీసభాళికిన్.

నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి

సూ—అతివిస్తరమేల! సకలకళాప్రవీణులగు నోసభాస్తారులారా! మీయాజ్ఞానుసారంబుగఁ బాండవాజ్ఞాతవాసము నాటక మాడుచుంటిమి. ఉచితపాత్రంబుల సిద్ధపరచి రమ్మని మున్నె ప్రేయసితోఁ జెప్పితిని. సిద్ధపరచినదో లేదో కనుగొనవలెను.

[నటిప్రవేశించి]

నటి—నాథా! నమస్కారము.

సూత్ర—మనోవాంఛాఫలప్రాప్తిరస్తు. నటీ! ఉచితపాత్రల సిద్ధ మొనర్చియే వచ్చితివా?

నటి—ప్రియా! మీయాజ్ఞకు బద్ధులు కానివా రెవరు? అన్నియు బూర్తి గానవి.

సూత్ర—(చిరునగవుతో) భేష్ నటీ! నీవంటి సమయానుకూల లభించిన నాభాగ్యమేమనవచ్చును. మనము ముందుకర్తవ్యమునకై కడగుదము. సభాసదులతో నొకవిన్నపము చేసివచ్చెదను.

నటి—ఏమని?

గీ. కలఁడు శౌనకసుగోత్ర । కలితలలిత
చిరుకుపల్లికులాంబుధి । శీతకరుడు
విమలకృష్ణయార్యసుతుండు । విశదకీర్తి
వెలయు వెంకట రామాఖ్య । జెలగునితడు.

గీ. అతడొనరించె బాండవా । జ్ఞాతవాస
మనెడినాటకమిది రస । ఖనియనంగ
దగునుగావున నాడగా । దలచినాము
మాన్యుల్ దయఁజూచి దీవనల్ । నెమ్మినిండు.

(అని పుష్పములు సభికులపైఁజల్లి ఇరువురు నిష్క్రమింతురు.)

ఇతి ప్రస్తావనం.







శ్రీ శారదాంబాయై నమః.

# పాండవాజ్ఞాతవాసము



## ప్రథమాంకము.

రంగము ద్వైతవనము

(పంచపాండవులు, ద్రౌపది, ధౌమ్యుడు, కొందఱుబ్రాహ్మణులు)

ధర్మ—(దోసిలియొగ్గి వినయముతో) బ్రహ్మతేజోభాసులగు నోభూసుర వర్యులారా!

సీ. సంసారములఁ బాసి । సంపదలనురోసి
దట్టంపుటడవుల । దయ జెలంగ
మముగూడి వనవాస । శ్రమమొందితిరికాదె
పదియును రెండేండ్లు బహువిధముల
గోపాలదేవుని । గురుతరకృపచేత
వనవాసమిలిదాటె । పదపడియొక
యజ్ఞాతవాసంపు । టబ్ధమొక్కటియుండె
నెట్లుగావింతుమో । నెఱుఁగనైతి

గీ. అక్కటా! ధార్తరాష్ట్రులు । హర్షమొంద
నక్షినముల నిట్లు శ్రమముగా । వించెగాదె

ముందు కర్తవ్యసరణి మీ । బుద్ధిఁదెలిసి
కూర్మి దళుకొంత్త జెప్పుడీ । కుతుకమునను.

అక్కటా! అజ్ఞాతవాసంబు సలుపుట బహుదుష్కరముగదా!

గీ. ధారుణీసురలార యో । ధన్యులార
యరయ నజ్ఞాతవాసంబు । నందు మనుజు
నితరు లెఱుఁగకయుండంగ । నెట్లు జనప
దంబులందు దిరుగ నురి । ధైర్యమున్న.

భీము—కావలెనని చేజేతుల జేసికొని యిప్పు డూరక వగచిన నేమి ఫలము?

సీ. పాంచాలి సభలోన । భంగమొందెడువేళ
గురుపతితోడ ద్యూత । నరుగునపుడు
వన్యమృగము లల్ల । బరిహాసింప విభుండు
ఘోషయాత్రకు వచ్చి । భీషణముగ
జిత్రరథునిచేత । శిక్షింబ బాదియై
కావంగ వేడెడు । కాలమందు
మమ్ముల నీయిచ్ఛ । మసలంగ జేసితి
మా నవాధీశ్వర । మానసమున

గీ. ధర్మరక్షణ సేయుంగ । దలఁచి నీవు
నిప్పుడజ్ఞాతవాసంబు । నెట్లుజరుపు
దంచుయోజింపుచుంటివి । యహహా నాడు
చూడమాడనీయూహా యె । చ్చోట జనియె.

అరే! సుయోధనా!

మ. పలుకింగాలము చెల్లనీకు నెపుర । క్షోణింగదందాల్పి యా
కలిచేతం గరిసంఘుముఁగనుచు లే । గంబారు పార్థుక్షుముం

దలఁపింపందగు శూరవీరనిధియా । ధర్మానుజుం డిప్పుడే
ప్రళయార్కుండనవచ్చుచుండెగనుమా । పర్యాప్తకైచ్ఛోటికిన్.

అరే దుశ్శాసనా!

ఉ. ఎవడుపాండురాజసన్నుత । నించుకయేనియు భీతిలేక దా
గ్రొవ్విమదాంధుఁడౌచు సభ । దుష్టవచంబులబల్కి మానముం
జివ్వనదుత్చె నా ఖలుని । శీఘ్రిమెదుర్కింపగదాధరుండనై
కవ్వడియన్న వచ్చెనిదె । కావగ నెవ్వరు దిక్కు నీకికన్.

గీ. భీమసేనుండు రిపుజన । భీకరుండు
వచ్చుచున్నాడు నీరొమ్ము । వ్రచ్చిరక్త
మానగా నేడు శక్తిని । బూనితేని
నిలచియుద్ధమొనర్చుమీ । నేర్పుకలిమి.

ఓరోరి కౌరవపశువులారా! మీకు గాలమానన్నమైనది లెండి.

(అని సగర్వముగా నడచును.)

ధర్మ—అనుజా! నామాటవిని యించుక శాంతమువహింపుము.

ఉ. కోపముబూని కౌరవుల । గూల్పఁగ నేగెడు వేళగాదు సం
తాపము మానుమీవ్యధను । దాచిననన్ను దలంచియైన, నీ
కోపము మాన్పఁగాఁగలనె । కుత్సితుఁడౌ కురురాజపట్ల నీ
వోపికబూనగావలయు । నోడక నీకడ యేను గూడఁగన్.

భీమ—అన్నయ్యా! ఇఁక నెక్కడి శాంతము. కురుకుమారుల పేరుదలంచి కొనిన యెడలు భగభగమండిపోవుచున్నది. ఒకటా రెండా? లెక్కకుమీరినన్ని యిడుమల నొందించిన వారిపట్ల నోపిక శాంతము, నెమ్మదిబూనిచరించుటకల్ల. అందునకుమరపువహిం తమన్నను మరపురాని ద్రౌపదీపరాభవాగ్ని నాస్వాంతంబున ననిశంబు బ్రజ్వరిల్లుచునేయున్నది. అయ్యది (ఔడుగరా!) దుశ్శాసనవక్షస్థలకవోష్ణరుధిరపానంబునగాని శాంతింపక,

అరేరే కురుద్రోహీ! కపటద్యూతక్రియాధూర్తుఁడా! దుర్యోధనా! నీకాయము కండకండలుగఁ గోసి కాకుల కెరవైచెద. అన్నయ్యా! నన్ను బోనీయుఁడు.

అర్జు—అన్నయ్యా! భీమసేన! శాంతింపుఁడు.

మ. అతులం బూల్చుట నీకు సన్నగను శా। ర్యస్ఫూర్తి రెట్టించుగా
సురనాథుం డటుగావవచ్చిన గణుం। జోద్యంబుగాఁద్రుంతు వా
ర! రణంబంను నమానవిక్రమమహీ। రదృష్టుఁ డెవ్వాఁడు నీ
పరిజాలుర్ రిపుభీకరా! సమయము। స్వాంతంబునంబూనుమా.

గీ. తీవిరి యజ్ఞాతవాసంపు। దీక్షగడిపి
కదనమున రింతసురులతోఁ। గలసిబాహు
బలిమి వెలయంగ జయమును। బడయవచ్చు
నిప్పుడేటికిఁ గ్రోధంబు। జెప్పుమయ్య.

భీము—తమ్ముఁడా! నీవు చెప్పినది సమంజసముగనేయున్నది కాని యీ పాపులబేరు దలంచినంత మనంబున శాంతికి స్థానంబులేకున్నదోయి.

సహ—అగ్రజా! భీమసేనా! మీరెఱుఁగనిధర్మంబులు లేవు పితృసమో జ్యేష్ఠః అనువాక్యము మరవరాదుగదా? మనకందఱకు జ్యేష్ఠసోదరులును, నజాతశత్రుబిరుదము గాంచిన యన్నగారి మనంబున జింత కవకాశమీయరాదు.

భీము—ఏమేమీ! అన్నగారు జింతయుననదికూడ నెఱుంగుదురా?

ఉ. వాచనలక్కయింట నిడి। వహ్నికిఁ బ్రీతిగ దూళిఁజేయఁగా
నెంచినవాడు జూదమున। నెల్లరగెల్చిన వాడుకష్టము
ల్పొంచినవాడు నన్నకును। బుట్టకుచింత యొకించుకేనియుం
జంచలు లద్దురాత్మకుల। జంపెదనన్న విచారముండెనుర్.

ధర్మ—తమ్ముఁడా! నిష్కపటహృదయుడవుగదా? కేవలము కోపమే కాని యొండేమియు నెఱుఁగవు.

గీ॥ అరులదంభ్యులకుట హృద । యంబునందు
దెలిసియున్నను ధర్మంపు । తెరవుఁజూచి
శాంతిబొందంగవలయును । శౌర్యధుర్య
కానిదివసముల నెంతటి । ఘనులకైన.

మనము పండ్రెండు వత్సరము లరణ్యవాస మొనర్చుటకును, కడ మూఁటవయేట పరులెవరును దెలియకుండ నజ్ఞాతవాసమొనర్చుటకును బ్రతినబట్టియుంటిమికదా? దానికిపుడు విరుద్ధంబుగ నడచిన ధర్మవిరుద్ధంబగు కావున నారుక్మిణీకాంతుదయావిశేషంబున యజ్ఞాతవాసవత్సరాంతంబున శాత్రవలోకంబును దునుమాడి విజయంబుగాంచుదము.

నకు—అన్నయ్యా! పరికథించ [illegible] పక్రవిక్రమంబున చించిచెండాడు సమయమువచ్చువరకు శాంతి. పుంగు. (చిటికలు వేయుచు) ఇంకెంత? ఒకవత్సరముపూర్తియైనప్పుడు మనశౌర్యాగ్నిప్రదీప్తము కాఁగలదు.

సహ—అగ్రజా! రిపుజనంబులొనర్చిన పరాభవము మరుపురానిదైన నన్నగారి వాక్యమున కడుగుదాటరాదు వారియిష్టానుసారంబుగ వర్తించుట మనముఖ్యకర్తవ్యము.

ద్రౌప—శాంతింపక యింకచేయునదేమున్నది?

భీము—దేవీ! నీవువచించునది యబద్ధము కాదు.

మ. పగరంజెండెడి దర్పముండియు నినుం । భంగంబుగావించుచో
మగువా! యాఖలుదృష్టపంజాలితినె భీ । ష్మద్రోణకర్ణాదియో
ధగణంబుల్ బెగడొందనప్పుడుం । ధర్మచ్యుతింజేసినా
తెగువంజూపెకవేళగామి విసువన్ తీ । డ్రింప మేలల్లంగున్.

ద్రౌప—అందుచేతనే యాయన్నగారికి మీరుదాస్యులైతిరి.

భీము—(కోపముతో) ఏమేమీ? మాయన్నగారివలె నేనూరకుండువాఁడ ననియా తలంచితివి, చూడుము.

చ. ప్రళయకృశానుకీలలని । వారణసేయఁగవచ్చు దర్పముం
గలిమిని బెబ్బులిం జెనకి । కాయము డాల్పఁగ నెంచవచ్చునా
జలనిధిఁ జేపనీదఁగను । సాహసమూనఁగ వచ్చుగాని యీ
బలియుఁడు భీమసేనునెడ । వైరము మాన్పదరంబె యేరికిన్.

ధర్మ—ద్రుపదకుమారీ! ఎట్లెట్లో భీమసేనుని కోపంబు శాంతింపఁజేయుచుండ నీవూరక ప్రజ్వలింపఁజేయుచుంటివేమి?

భీము—(ద్రౌపదిం జూచి)

ఉ. కొంకక శత్రుసంఘముల । గూల్పఁగఁజాలెడిశక్తి యుండియే
శాంకముఖీ! ప్రభావము న । మాచితరీతిని జూపకుంట మా
వంక మహాపరాధమని । వార్యమునైన నజాతశత్రు హృ
త్పంకజ శాంతభావము న । దాయరికట్టెడు శృంఖలాకృతిన్.

అన్నయ్యా! మీయాజ్ఞకు బద్ధుఁడనై చరింతును. (గదనుగాంచి) సంవర్తకాలకాలగదాదండతుల్యమద్గదాదండమా! నీవెంతరిపుభంజనమునకు సందడిపడినను లాభము లేదు. మాయజ్ఞాతవాసాంతంబున నీకు శత్రుపలలాశనంబున దృప్తి గావించెదను. కొంత కాలంబోపిక పట్టుము.

ధర్మ—(బ్రాహ్మణులగాంచి) దయామయులగు నో భూసురులారా! మాయందలి నిర్హేతుకజాయమానకటాక్షంబున మీరు భార్యాపుత్రాలయంబుల విడచి వనవాసాయాసంబు నొందితిరి. ఇఁక మేము జరుపునది యజ్ఞాతవాసంబు, కావున మమ్ము నొరులెఱింగిన మోసము వాటిల్లు. మాయగ్నిహోత్రంబుల ధౌమ్యులు రక్షింపుచుందురు. పాంచాలీపరిచారికాజనంబులు వంటలువారలు ద్రుపదునిపాలికిఁ జనెదరు. ఇంద్రసేనాది సారథులు ద్వారకానగరంబున కరుగువారు. మీరు మీగృహంబులకు వేంచేయుఁడు. మావార్త యితరులకు దెలియకుండునట్లు భద్రపరచుమని మిమ్ములదిరుగ ప్రబోధింపనక్కరలేదు.

బ్రా—కుంతీసుతాగ్రజా! నిరంతర ధర్మమార్గసంచారుఁడవగు నిన్ను నాథ భక్తవత్సలుఁడే రక్షించును గాక! నిన్ను బాసియుండుటకు మాహృదయము లంగీకరింపకున్నను మే మరుగక దప్పనిసరి యగుటచే విడిచి వెళ్ళుచుంటిమి.

ధర్మ—అచిరకాలంబుననే పునఃదర్శనంబగుగాక!

(బ్రాహ్మణులు నిష్క్రమింతురు.)

ధర్మ—గురువర్యా!

గీ. కాననంబులఁ గాలంబు । గడపినాము
జరుపవలయు నజ్ఞాతంబు । జనపదంబు
లందు గాన వరకృప మా । యందు నిల్పి
బోధసేయుఁడీ కార్యంబు । ముగియు వెరవు.

ధౌమ్య—ధర్మరాజా! ఏల యిట్లులజడిపడెదవు? కాలము మంచిది గాని సమయమున నెంతెంతటివారికి నిడుమలు రాకమానవు. ఇంద్రుండు ప్రచ్ఛన్నవేషధరుండై నిషధాద్రియందడఁగియుండె. మార్తాండుం డజ్ఞాతంబు జరపె. హరిశ్చంద్రుండు మాలఁగొలిచె. నలుండు బాహుకనామంబున ఋతుపర్ణుని సేవించె, శ్రీరాముండు వనవాసాయాసం బనుభవించె. వీరందరు కాలగతిని దాటలేమనిగదా యిట్టి కష్టముల పాల్పడి క్రిమ్మఱి మహోన్నత్యంబు బొందలేదా? మీరునస్త్రీ యొకయబ్దమువరకెచటనైన గుప్తమార్గంబున జరించి పిదపవిరోధుల నిర్జించి పూజ్యరాజ్యంబు బాలింపుడు ఆర్తిభంజనుఁడగు నాపరమ పూరుషుఁడే మిమ్ము సర్వవిధంబుల రక్షించునుగాక.

ధర్మ—మహానుభావా! మేమందర మొకచోటునకేగిన మమ్ముఁగాంచినంతనె పాండవు లదే వచ్చిరని జనంబులు వచ్చి జూడకమానరుగదా! ఎట్లీయజ్ఞాతంబు నిర్వర్తింతుమో తెలియకున్నది.

అర్జు—ధర్మజా!

గీ. యక్షరూపంబున నవచ్చి । యధికకృపను
ధర్మదేవత వరమిచ్చె । గాన మనల
నొరులుగుర్తింపఁ జాలరు । నరవరేణ్య
మెచ్చనైన దిరుగభయ । మింత లేదు.

అన్నయ్యా! పాంచాల, చేది, మత్స్య, బాహ్లిక, బర్బర, దశార్ణ, శూరసేన, కళింగ, మాగధ, విదేహదేశంబులు సుభిక్షంబులనియు జనాకీర్ణంబులనియు దెలియుచున్నది. అందు మీ యిచ్చవచ్చినచోట వసింతము.

ధర్మ—తమ్ముడా! అర్జున.

గీ. మత్స్యనాథుండు విరటుండు । మానవాతుం
డధికశౌర్యధుర్యుండు ధ । ర్మానువర్తి
గాన నచ్చట నిర్భీతి । గాపురంబు
సేయవచ్చును యోజన । సేయ నేల.

అతనికడ మనముండిన నేరొరంతయు రాదు.

ధౌమ్యు—మీరునివసింపదగిన తావదియే.

ధర్మ—మనమేరీతి విరటునికడ మెలంగవలయునో తెలియకున్నది. మనవహించిన్న వేషంబు లొరులుగుర్తింపరాదుకదా?

అర్జు—అన్నయ్యా! మీరు సెలవిచ్చినది సత్యమే. ఆహా! ఎవరికి విధివిధానంబు దాటవశంబుకాదు. (ఇంచుకయూరకుండి) నిరతంబు ధర్మవర్తాచరణచరణుండవగు నీవు.

సీ. రాజమండలిలోన । తేజస్వియై రాజ
సూయంబుగావించు । సుజనుండవయ్యు
భూధరావళిపాలి । పొడమువారిదలకు
కాంతివహించిన । జాలు నీవంటి

ధర్మవ్రతాచార । తత్పరత్వంబున
మేటియన్న యశంబు । మించినవాఁడు
తనయందు వైరత । త్వంబింతలేమియు
జాతశత్రుండన । జాలునెవఁడు

గీ. కుంతికిని ముద్దుకొమరుండై । కోవిదాళి
వినుతిసేయంగఁ దగినట్టి । విభుఁడు ధర్మ
రాజు మత్స్యేశుచేఁత ని । స్తేజుఁడగుచు
సేవసేయంగవలసెఁగా । దైవనియతి..

ధర్మ—తమ్ముఁడా! అర్జునా! నన్నుగురించి విచారింపకుము. నేను న్యాసివేషంబున విరటునొద్దజేరి ధర్మంబులుపన్యసించుచుఁ బుణ్యకథలుజెప్పుచు నాతని చిత్తంబురంజిల్లవర్తించెదను. ఒకొక్కప్పుడు వినోదంబునకై జూదంబాడి మనంబున బ్రసన్నుండై యొసఁగు పారితోషికంబులంది జెలంగెదను. కంకుభట్టన నాతనికడ జరించెదను. నాపూర్వచారిత్రంబడిగినచో ధర్మజుని మిత్రుండననియు నాతనిపాలనసించితిననిఁ బలికెదను. (ఇంచుక యూరకుండి)

సీ. పాంచాలికోరిక । బరిపూర్తిఁ జేయంగ
సౌగంధికము దెచ్చె । సాహసమున,
కిమ్మీరదనుజుని । గీటడంచి కానలో
భీతినిమాన్పని । ర్భీతుఁడగుచు,
విప్రార్భకునిగాక । వెడలి బకాసురు
ఖండించి కాచెద । కుశల కరము
మట్టఁజైనహిడింబ । దునిమియాతని చెల్లె
లిని పెండ్లియాడఁడే । లీలతోడ

గీ. పితఁడు జన్మంబు మొదలుఁగ । నన్నిశౌర్య
సాహసంపుపనులు చేయఁ । జాలినాఁడు
అట్టివీరుఁడు విరటుని । నడఁగిమ్రొగ్గి
కొలుచుటెట్టులో తెలియదు । కొందఘుటిల్లె.

భీము—(ధర్మరాజునుజూచి) అన్నయ్యా! నాకై విచారింపకుము.

చ. జనపరసన్నుగూర్చి మది । చాలఁగఁజొక్కఁగ నేలతేని నె
మ్మనమును భక్ష్య భోజ్యములు । దివ్యతరంబుగ శాకపాకముల్
ఘనమతిఁ జేసిపెట్టుచును । గాలముబుచ్చెద జింతయేటికిన్.

నేనా విరటనరపాలుని జేరి వంటజేయుటయందు నాకు మిక్కిలి చాతుర్యముకలదని వక్కాణించి కొలువుచేయుచు బహురకంబులగు వంటలు బిండివంటల నానృపుని స్వాంతమున కెంతేనిమోదంబుఘటిల్ల వర్తించెదను. మరియు వంటకట్టెలకై గొడ్డలి మొదలగు సాధనంబులుపయోగించుట మాని కాళ్ళచేతులవిరచి పనులుకొనసాగింతును. ప్రభునివినోదార్థముసింహముతోఁగాని యేనుంగుతోఁగాని బోరెదను. సూపాధ్యక్షుఁడెవఁడైననుండిన వానితోసఖ్యంబు నాటించి మెలంగెదను. ఆభూపాలుని మీఁది కెత్తివచ్చిన వారినవలీలజయించివిభుని గెలిపించెదను. నాపూర్వవర్తన మాపురమి కేడడిగిన ధర్మజాని వంటలవాఁడనని వక్కాణించెదను.

(కొంచెముసేపూరకుండి)

సీ. ఖాండవదహనంబు । గావించియగ్నిచే
గాండీవమునుగాంచు । ఘనుఁడెవ్వఁడు
ఘోలనేత్రునితోడ । ఖండనమొనరించి
పాశుపతాస్త్రంబు । బడసెనెవఁడు
కాలకేయాదిన । క్రూరచరులవధించి

యిందుప్రవర్ధాననం । బెక్కెనేవఁడు
రణభూమి దనసాటి । రానిశౌర్యంబున
విజయుడనంగను । వెలసెనెవఁడు

గీ. అట్టివీరాధివీరుఁ డీ । యర్జునుండు
విరటునేరీతిగొలువంగ । వెలయువాఁడు
తనదువీరచిహ్నంబు గు । ప్తంబుచేసి
దాటశక్యంబె దైవ వి । ధానములను

అర్జు—అన్నయ్యా! పవమాననందనా! మీరు నాకై యోజింపకుఁడు. వెనుక నేను స్వర్గంబున కేగినప్పుడు నన్నూర్వశి నపుంసకునిగా శపించినది. ఇంద్రుఁడు నాయందు గరుణించి ముందజ్ఞాతవాసంబున నుపయోగించునని వచించెను. గాన పేడినై బృహన్నల నామంబున నవ్విరటుని చేరి కన్యలకు నృత్యగీతాదుల నేర్పుటయందు ప్రజ్ఞకలదని బలికి యాతనికడ వసించెదను. మరియు మదీయబాహుదీర్ఘత్వమ్మును గుణకిణంబులకు గంచుకంబును శంఖవలయంబులును మాటుచేసి పుచ్చెదను. నీవెక్కడవాఁడవని నన్నడిగెనేని ధర్మజునికడ శుద్ధాంత కాంతాజనంబులకు భరతాచార్యుండనై యుంటినని వచించెదను.

ధర్మ—తమ్ముఁడా! చాల బాగున్నది. (నకులసహదేవులంగాంచి) ఆహా! ఈ మాద్రేయులు పుట్టిననాటనుండి కష్టమ్ములెట్టివో యెఱుంగరు. అతిసుకుమారులు. వీరలు విరటు న్నెట్లురాజింపఁ జేయువారలో కదా! ఇతరులమనసునచ్చునట్లు సేవసేయుట బహుప్రయాసము

నకు—అన్నయ్యా! మీరు నాకై చింతిల్లకుఁడు.

గీ. తురగ విద్యల నేర పో । గుఱుఁడననుచు
బల్కి యాతని సేవింతు । బ్రజ్ఞమీర

పడిగినేని నావార్త న । మవనిభుడు
ధర్మజుని సేవకుఁడనని । మర్మమిడుడు.

దామగ్రంథియనుపేర విరటుని సేవించుచు నాతనిమన్ననలగాంచెదను.

పహా—అగ్రజా! మత్స్యదేశాధీశుని కొలువుకూటంబుచేరి వాకుగీలారి తనంబున మిగుల పాటవంబు కలదని వచించి తంత్రీపాలుండను పేర నవమ్మానవాధీశుని గొల్చుచు నాతనిపశువులపరిపాలింతును. ఆతఁడు నాపూర్వవర్తనంబడిగినేని ధర్మజుని గోష్ఠంబుల కధిష్ఠనై యుంటినని వక్కాణింతుచు.

ధర్మ—మీరువచించినదిబాగున్నది. (ద్రౌపదినిగాంచి) ద్రుపదమహా కాంతుని యజ్ఞగుండంబున జన్మించి యాజ్ఞసేనివై పరమపతి వ్రతాశిరోమణివగునీవు పరిచారికాసహస్రంబులు కొలువ గొలువుండునీవు. రాజసూయాధ్వరంజనకు ద్వాతుభాగస్థితవై యలరారునీవు సకలజీవదయాపరుండగుచు మాకుగడుంగడు గూర్చు శ్రీకృష్ణభగవానునికి సోదరివైయలరునీవు సూర్యవీర ప్రభావంబున యనేక విప్రోత్తములధనియించి వారిచే స్తోత్రం గొన్ననీవు లోకమాన్యతగొన్న కుంతీదేవికి ముద్దుకోడలవగు నీవు యఖండభాగ్యభోగ్యంబులందిననీవు పుట్టినదిమొదలు నేటివరకొరులచే సేవలుగొన్ననీవు ఒకపరిచారికభంగి ఇతరుల యిష్టానుసారంబెట్లు మెలంగెదవోకదా! అహా దైవనియతి? ఎట్టి వారినైన కట్టికుడిపితీరును.

ద్రౌప—దేవా! మీరునాకైదుఃఖిల్లకుడు. సైరంధ్రీవేషంబునమాలిని యనుపేర నామహారాజుపత్నియగు సుధేష్ణాదేవినిగొలిచెదను. ఆదేవిమెచ్చునట్లు గంధంబుతీయుట, పూలుగ్రుచ్చుట, మొద లగుపనులయందునమితగశృంగారము సేయుటయందును నామె

మనంబువచ్చునటుల మెలంగెదను. నీవెచట కంటివని యడిగిన పాంచాలికడ పరిచారికనై యుంటినని తెలిపెదను.

ధర్మ—వనితామణీ! నీయుద్యమము బాగున్నది. మర్యాదభంగంబుగా కుండ పాతివ్రత్యమునకు హానిరాకుండ నీవామెను సేవింపుము.

ధౌమ్య—రాజా! ధర్మజా! మీరందరు నవ్విరటునికడ మెలఁగవలసిన పనులనేర్పరచుకొంటిరి. మీకు సమస్తధర్మాధర్మములు తెలిసియేయున్నవి. కాని సేవాధర్మములుమాత్రము నేను చెప్ప వలసియున్నవి.

ధర్మ—మహానుభావా! ఇంతకన్న మాకుఁగావలసినదేమున్నది? అయ్యా! సెలవీయుఁడు. సావధానమనస్కులమై యాలించెదము.

ధౌమ్య—పాండవేయులారా! మీరు చిన్ననాటనుండి నొరులచే సేవింపబడుటయె కాని యొరులగొల్చియెరుగరు. శౌర్యప్రతాపంబుల సాటిలేని వీరాధివీరులగు మీరు వైరిజనంబులొనర్చిన పరాభవాగ్ని నిరంతరంబు మీమనంబుల బ్రజ్వరిల్లుచుంటచే శాంతిజలంబుల తద్వీతిహోత్రంబుజల్లార్చి మానావమానంబులకోర్చియాభూపాలునిగొలువవలయును. రాజునన్నాదయఁజూపుచుండెగదాయనిగర్వింపరాదు గర్వించినచో బహుమానంబునకు హానివాట్లును నృపుడేరికైన కార్యంబునియోగించునపుడు తనకుఁదానై యాపనిజేయుదునని తనతలపైఁబెట్టుకొనరాదు. నరపాలునిచిత్తవృత్తి యెరింగి వర్తింపవలయును. నగరిలోనిరహస్యంబుబయలుచేయరాదు. శుద్ధాంతపరిచారికాజనంబులతోఁ జెలిమిచేయరాదు. కరుణమీరభూరమణుండిచ్చు వాహనాదులుపయోగించుటయెన్నగాని రాజాజ్ఞమీరి గజాశ్వాందోళికాదుల స్వతంత్రించి యెక్కరాదు. రాజుదనకెంతటి యాప్తుఁడైననా తనిసొమ్ముహరింపరాదు. రాజునకు విరోధులతో, స్నేహము

చేసి మెలగరాదు కలిమియున్నందులకు ఫలము భోగముగదా యని దలంచి తనయిచ్చవచ్చినట్లనుభవింపరాదు.

ధర్మ—స్వామీ! మాయందలిపరిపూర్ణవాత్సల్యంబున సేవాధర్మంబులు పన్యసించి మమ్ములధన్యులం జేసితివి, మేమిచ్చోటివాసియరిగెదము మమ్మాశీర్వదించి పంపించుఁడు

ధౌమ్య—మీకు సమస్త శ్రేయంబులాపుండరీకాక్షునియనుగ్రహవిశేషంబున గలుగుగాక. నేనరిగెదను.

(అందరుధౌమ్యునకునమస్కరింతురు. ధౌమ్యుఁడునిష్క్రమించును.)

ధర్మ—తమ్ములారా! పాంచాలీ! మనమిక విరటనగరాభిముఖులమై వెడలుదమురండు.

ఉ. చిన్నటనాటినుండి నిను । చేరిముడిచి బెంచిన తల్లిదండ్రుల
న్మన్ననతోడగొల్చు సఖి । మాడలిబాసి సతంబుమమ్ము నీ
వెన్నికమీర నెన్నికొని । యించుకసౌఖ్యమునందవైతిహా!
యున్నగభూములందిరుగ । నిట్లులిఖించె విధాతృఁడాగదా!

భామినీమణీ! చిన్నతనంబున బుట్టింట నేమిసుఖంబనుభవించితివో కాని మమ్ముచేపట్టినది మొదలు కష్టపరంపరలేయనుభవించితివి. సుఖం బించుకంతైన నెరుఁగవుకదా?

ద్రౌప—దేవా! మీరట్లనరాదు. సతులకెప్పుడుపతులమార్గంబనుసరణీయము సుఖముగానిండు కష్టముకానిండు. మీచెంతనుండినదదియె పరమసంతోషము.

(అందరుముందునడచుచున్నారు. ద్రౌపదివెనుకఁబడుచున్నది)

ధర్మ—అర్జునా! మనము ముందునడచివచ్చితిమి. ద్రౌపది మనలగలిసికొనలేకున్నది.

గీ. ఘర్మకణములు జార । గా కలికిమిగుల
శ్రమముమీఱంగనడిచి రా । జాలకుండె
గావునను మనచెంతకు । గాంత జేర్చ
నరుగుమీవేగ దడయక । నర్జునుండ!

అర్జు—అన్నగారిసెలవు ననుసరింపుచుంటిని. (అని పాంచాలిజేరనడచి) పాండవపత్నీ! నీకు మన్నుల్లగూడినందులకు శ్రమముతప్పినది కాదు. భువనైకవీరుండవని విఖ్యాతిగాంచిన నన్నునీవుస్వయంవరంబున బెండ్లియై, యనుభవించుచు సుఖించిరికదా? సతీ! నీవు నడువలేకున్నదానవు, కావుననిన్నెత్తుకొనివచ్చెదనురమ్ము అయ్యయో చరణతలంబుల నెత్తిలేసి బొబ్బలెక్కెనవోకదా! (అని ఎత్తుకొని) నడచుచు అదె నగరంబు సమీపించితిమి.

ద్రౌ—నాయకా! శ్రమముకొంతవాసినది (అనిదిగి) మీవెనువెంటనే నిదెవచ్చుచున్నాను. (అనియిరువురు నడచి ధర్మరాజాదులను సమీపింతురు)

ధర్మ—సోదరులారా! అల్లదె గోపురప్రాకారంబుల మిగులబ్రకాశమానంబై విరటనగరంబు దృగ్గోచరంబగుచున్నది. మనము శస్త్రాస్త్రపాణులమై విరటుని జేరబోయితిమేని మనలనానవాలుపట్టగలరు కాన మనమిచట నెనమనయాయుధంబుల గుప్తంబుగనవిలపరచియజ్ఞాతవాసాంతంబునమరలగైకొందము.

అర్జు—అన్నయ్యా! మీరు సెలవిచ్చినది సమంజసముగనున్నది.

ధర్మ—(ఇటు నటు పరికించి) తమ్ములారా! అల్లదె శమీవృక్షంబు శాఖోపశాఖల సాంద్రంబై కనుపట్టుచున్నది ఈతావుశ్మశానవాటికగానోపు. ఇందు జనసంచారంబరుదు. ఎవరైన నిజమ్ముచెంతకు దరుచుపోవరు మన శస్త్రాస్త్రంబులీ చెట్టుమీదం బెట్టిన భద్రంబుగనుండును.

అర్జు—తమ్ముడా! భీమసేన! నీగదాదండంబిటు తెమ్ము.

భీము—(గదనుజూచి విచారముతో)

మ. పరికయంబై యతిభీకరంబయి కృపా । రాహిత్యమై ఘోరమై
కులిశంబుం హసియించు సారయుతమై । క్షోణీస్థలింబెక్కువై
రులగర్వాంధతమంబుబాపిన మహా । ప్రోత్సాహియైయీగదన్
లలిఁబూడంగను జాలనక్కటకటా । నాకేది దిక్కీ యెడన్.

గీ. వైరిభీకరమగుచు సం । భావ్యమైన
గదనువిడచి నేనెట్లు । బ్రతుకువాఁడ
నైన నగ్రజు నాజ్ఞచే । నధికచింత
ప్రాణపదమైన గదవీడి । వరలవలసె

ధర్మ—తమ్ముఁడా! వాయునందనా! దీనికింత వగలబొగుల నవసరము లేదు ఆయుధసహితులమైమన మొరులకంటబడిన వెంటనేగుర్తింపబడుదుము. మన శ్రేయంబుకొరకిట్లుజేయక తప్పదు. కావున యజ్ఞాతవాస వత్సరాంతంబున దిరిగి యాయుధంబుల దాల్ప వచ్చును.

భీము—అన్నగారి యుత్తరువు ననుసరింపుచుంటిని. (అని గదను కండ్ల నద్దుకొని ధర్మరాజునకిచ్చును.)

ధర్మ—అర్జునా! నీ గాండీవంబిటు తెమ్ము.

సీ. ఫాలాక్షు నిర్జించి । పశుపతాస్త్రంబు
బడయుభాగ్యంబు నీ । వలనగాదె
చిత్రరథుని గెల్చి । క్షితిపతిబంధంబు
కదలించుబలిమి నీ । వలనగాదె
కాలకేయాదుల । గాలుపోలికిఁబంపి
యశకీర్తి నందనీ । వలనగాదె
భీష్మాదివీరులఁ । గదనభూమిజయింపఁ
దలఁచియుండుటలు నీ । వలనగాదె

గీ. నాకు మిగులసహాయునై । న నినుబాసి
యెట్లు దిరుగంగనేర్తునో । యెందుఁ గిరీటి

ఘోరసంగర భూమిని । కోపరుమిగులు
కార్ముక శ్రేష్ఠమైనట్టి । గాండివంబ.
గీ. నిన్నువిడచినేనెట్లు । సన్నుతులచు
జెందువాడను విశవంగ । జేయరాదు
కాన ధర్మజువాజ్ఞచే । బూనినేను
కడకువిడచెదనక్కటా! । గాండివంబ.

(అని కన్నులనద్దుకొని గాండివ బిచ్చును.)

ధర్మ—నకులసహదేవులారా! మారునలుకక మీమీయాయుధంబు లిటుతెండు. (నకులసహదేవులు తమతమ యాయుధంబుల గన్నుల నద్దుకొని యిత్తురు) (లోన కలకలము.)

ధర్మ—ఈశమీవృక్షాధిష్టానదేవతలుగు నోభేతాళా! మాయాయుధంబుల భద్రింబుగ నొకవత్సరంబు గాపాడుము. నీకు నేటేట నుత్సవంబులు సేతుము. (ఆయుధంబులన్నియు శవాకారంబుగ గట్టి శమీవృక్షంబుపై బెట్టును) మహాస్త్రంబులారా! మీరు నాకును పార్థునకును దక్క యొరులకు నదృశ్యులైయుండుడు కురుకుమారులపై గోపంబురెట్టింప వాయునందనుండు సమయా సమయ విచారశూన్యుండై మీదగ్గరకువచ్చిన వానికి జిక్కకుడు. (తమ్ములగాంచి) సోదరులారా! మనశస్త్రాస్త్రంబుల గుప్తంబుగ దాచితిమి. సంతసంబును సంరక్షించు నా రుక్మిణీకాంతు నొకసారి ప్రార్థించి పురంబులోని కేగుదము.

శా. లీలామానుషవిగ్రహా! వ్రజసతీ । శ్లేషానుమోదాత్మకా!
కాళీయాహిఫణాగ్రరంజిత పదా । కారుణ్యపాథోనిధీ!
కేళీకందుకతుల్యభూధరధరా! । కీర్తి ప్రసంగ బాలజా
లోలామన్మథయంగసంగ వరదా! । యిక్కట్లుజేపట్టగా.

అందఱు నిష్క్రమింతురు.







శ్రీశారదాంబాయైనమః

# పాండవాజ్ఞాతవాసము

## ద్వితీయాంకము.

రంగము—సుధేష్ణమందిరము.

(సుధేష్ణనిద్రించుచుండును. ద్రౌపది మాలిని ప్రక్కనిలచి యుండును.)

ద్రౌప—ఆహా! కాలమహిమ అనేకపరిచారిక లుపచారంబులు సలుప మహావైభవంబున గొలువుండు నేనొక సామంతనరనాథుని పత్నికి బరిచారికనై కొలువవలసివచ్చినది నాపతులు బహుబలపరాక్రమసంపన్నులయ్యు సేవకులవలె నీవిరటుని గొలుచుచున్నారు. మన్ననలదయమీర గంటికిరెప్పవలెగాచు శ్రీకృష్ణభగవానుఁడు నాపక్షంబుననుండినను మాపాటులు మాకు దప్పినవికావు మాలెక్కయేమిటి? సర్వజ్ఞుఁడగు శివునంతటివాఁడు వెండికొండ నివాసంబుగలిగియు ధనపతిమిత్రుఁడై యుండియు, పుఱుకడాల్చి తిరుగవలసివచ్చెను. కాలగతిదాట నెవరివశముకాదుగదా? ఈసుధేష్ణ నేటివరకు నన్ను గారవముతోఁ గాంచుట మదీయసుకృత పరిపాకంబని యెన్నవచ్చును. నాపతులీయజ్ఞాతంబు పూర్తిగావించి యెప్పుడు దాయులజయించి రాజ్యంబుపాలింతురోకదా? ఎప్పటికేదివచ్చునో తెలియఁగాదు.

(కీచకుఁడు ప్రవేశించును.)

కీచ—నాయక్క యగు సుధేష్ణను గాంచి పెక్కుదినంబులైనది. ఆమె యోగక్షేమంబులు కనుగొందును అదిగో! నాసోదరి నిదురించుచున్నది ఆమెప్రక్క నెవతెయో పాదగమున నిలిచియున్నది. (సమీపించి) ఆహా!

గీ. జలధరాచ్ఛాదితంబగు । చంద్రరేఖ
కరణి మాసిన వస్త్రంబు । గట్టి భువన
మోహనాంగి యెవతెయో సు । ముఖి యయియుట
గానవచ్చెడు సౌందర్య । గరిమ దాల్చి.

ఇదియెవతెయో! దీనిని గాంచినంత నాహృదయంబున మార వికారంబుదయించినది ఈకాంతామణికి గాంతుడైనవాని జన్మమే జన్మము. వాఁడే ధన్యుఁడు. నామనోరథము నెరవేర నాయక్క కూడ నిదురించుచున్నది. (ద్రౌపదిని సమీపించి)
సుధాంశుముఖీ!

క. నినుగన్న తల్లిదండ్రులు ఘనమతి బెండ్లాడినట్టి । కాంతుని పేరుఁ
వినిపింపుము వనితామణి! వినగోరెద వర్తనంబు । వివరముగాఁగన్.

చ. ఇలగల నందగత్తియల । నెందరినో కనుగొంటిగాని యీ
నెలతను బోలుదానిఁగన । నేర్తునె యప్సరలందునైన నా
జలజభవుండు చాతురిమ । సర్వము వెచ్చమొనర్చి చేసె గా
వలయు జగంబునందు చెర । భామలకందము జాద మున్నదే.

ద్రౌ—(ఊరకొనును)

కీచ—సుందరీమణీ! నీవర్తనంబు దాచక నాకెఱింగింపుము. ఒకవేళ నాతోఁ బలుకనీవు గొంకెదవేమో? అట్టిభీతి జెందనవసరము లేదు.

గీ. ఈసుదతి నాదు సోదరి । యేణనయన
నీవు నాయక్క సేవింతు । నియతితోడ
గాన నాకడ వ్రీడాత్వ । మూననేల?
నున్నచందంబు దెలుపుమీ । యువిదమాకు.

(ఇంచుకయూరకుండితనలో)

ఈకాంత నామాటకు మారుపలుకకయూరకున్నది. నేనేమి చేయుదును. ఎట్లు మదనశరహతిపాలుగాక తాళుదును దీనిని జూచినంతన నాస్వాంతంబు గొంతందలినది. ఆహా! సౌందర్యము త్రిలోకమోహజనకంబుగదా?

సీ. మోహనాంగిరో! నిన్ను । బొందనిపురుషుని
జన్మోన్నతియదేల । జగతియందు
సారంగనేత్రిని । సల్లాపసౌఖ్యంబు
గాంచనిపీనుల । కలిమియేల?
కళ్యాణిసీరూపు । కన్నారగాంచని
కనులవిశాలత్వ । గరిమయేల?
శ్రీనిలచుకనుదోయి । చెల్వంబు బొడగన్న
స్వాంతమందేరీతి । క్షమభరింతు

గీ. వెలయననురాగమాలిక । విస్తరిల్ల
నేలనాతోడమాటాడ । నేమిమగున!
మించువిల్తుండుశరముల । బొంచివేయు
చుండె తాళుదునెట్లు నే । దండగమున.

సీ. కరిరాజగామినీ! । కమలాక్షి! వామాక్షి!
బింబోష్ఠి! పన్నగ । వేణి! తరుణి!
షట్పదకుంతలా! । చంపకనాసిక!
దాడిమీబీజర । దన! వరాంగి!
శరదిందువదన! బం । గరుశలాక! సుదతి!
మదనుచేతికటారి! । మంజువాణి?
సింహేంద్రమధ్య! కు । శేశయగంధి! భు
వనమోహనాకార! । ఘనవిశాల

గీ. హృదయ! నీయంతినీమణీ! । యింతి! ఫ్రాల
భాతి! చెంగల్వదొంతి! స । దంతి! నీకు
నింక నేవిధిబిరుదాళి । నీయగలను?
కలికినంతశా వజాళ్రిలు । వ్రియము బడునె?

మ. తరుణీ! దాపగనేలదర్పకుఁడు చి । త్తంబు త్తలంబందగా
శరజాలంబులనుంచె దాళగలనే । సంభావ్య భావంబునం
దరిఁచేర్పం దరియయ్యె నత్వరముగా । దాళంబుజల్లార్ప వే
యరిభావంబునఁజూడ నీకుఁదగునే । యబ్జాక్షి నన్నిట్టులన్.

నీకులగోత్రంబులదెలపి నంతన నీకుఁ గొఱతలయులవడునా? సుందరాంగి! నాకడబిడియపడుట నీకు దగదు.

కం. ఈవిరటుఁడేఁబలమున । గావించును రాజతంత్రి । ఘనవిధులతివా
యావివిధవిధానజ్ఞుని భావింపుమునింహబలుని । భావమునందున్.

ద్రౌ—(తనలో) ఈతఁడు సుధేష్ణాదేవికి సోదరుండననియు విరటుని భావమరదిననియుఁ బలుకుచున్నాడు. వీఁడు కామాంధుఁడై కన్నుమిన్నుఁ గానకున్నాడు. వీనితో సంభాషింపఁజనదు. నాధర్మ మార్గోపదేశంబున వీని గుర్బుద్ధిమరల్పఁ జూచెదను. (బహిరా) మహారాజా! నేను సైరంధ్రిజాతిదానను. నన్ను మాలినియందురు. మీ యక్కగారిని సేవింపుచుందును. నీచురాలనగు నాతో భాషింప మీకేమియవసరము?

కీచ—సుందరీ! నీవు సైరంధ్రిజాతి దాననంటివి. ఇది నమ్మదగినమాట కాదు నీచసైరంధ్రిజాతికిట్టి సౌందర్యంబు మరేంగితజ్ఞానము తెలివితేటలుండవు నిక్కమరయగా నీవు క్షత్రియకాంతవుగాని యన్యకులీనవుకావు.

ఉ. నీచమనంగనెద్ది తగు । ణీ! సురకాంతలలోన నన్నఁగాఁ
దోచున యిట్టిచందము వ । ధూతిలకంబవు నిన్నుగాంచ న

స్నేచ దోడంగె బుష్పశరు । డెన్నఁగ రించును మూడునైన నా
రాచము లేసి కాపలె । దాన సరోజదళాయిదాక్షిరో!

ద్రౌప—(తనలో) అక్కటా! ఎట్టిదురవస్థతటస్థించినది. ఈతఁడు కడుం గడు మదనాతురత్వంబున యుక్తాయుక్తజ్ఞానశూన్యుండై వర్తిల్లుచున్నాడు. నావంటి పరమపతివ్రతం గవయఁగోరిన వీని కాయువు మూడినదనియే యెన్నవచ్చును. వినాశకాలే విపరీత బుద్ధిః అను నార్యవచనము వ్యర్థముకాదు. వీనినెరిఁగియైన సన్మార్గమునకుఁ ద్రిప్పవలయును. అట్లు దిరుగకున్న వీనిని మృత్యుకాంతయే బిగ్గఁ గౌఁగిలింపఁ గలదు. (ప్రకా) రాజా! నీచురాలనగు నన్ను తమవంటి నృపశిఖామణులు కోరరాదు. నేను సేవకురాలను సైరంధ్రీజాతిదాన నని మరల మనవిచేయుచున్నాను. పతివ్రతను. నన్నుఁ గోరుట తమకుఁ దగదు.

కీచ—(సగర్వముగా) నీచురాలనని చెప్పినంతమాత్రమున నేనునమ్మెదు ననుకుంటివా? నావంటి రసికాగ్రేసరుఁడు కోరిన నీనీచత్వంబగు సేవకావృత్తి వదలి మహారాజ కాంతలకేని లేని వైభవంబుగలు గదా? పసిపాతను మాణిక్యము గట్టినంతమాత్రము దాని నిరుపమానకాంతి కొరఁతపడునా? ఈమాసినకోక విడచి చీని చీనాంబరంబుల ధరింపుము. వెలలేని తారహారంబు లఁదగిలింపుము. అనేక సేవకురాండ్రు నీ కుపచారంబులు సేయ మహారాణివై మదనసామ్రాజ్యమేలింపుము. లెమ్ము. నాతోడరమ్ము.

ద్రౌప—(చెవులు మూసికొని) హరి హరీ! పాపము శాంతించును గాక! ఎంతమాటాడితివి. రాజా! నాపలుకులు నీకు వినఁ గటువుగనుండినను నీకు శ్రేయస్కరంబగుట చేఁబలికెదను. సావధానమనస్కుఁడవై యాలింపుము దేహంబు లనిత్యంబులు. వైభవంబులు చంచలసదృశంబులు. సౌందర్యంబుస్థిరంబు గాదు.

ఇదంతయు బైపై మేనికాంతి కాని యదార్థమాలోచించిన మలభూయిష్ఠమైన తోలుబొమ్మ వ్యర్థమాత్రంబు దీనిని కోరినందున ననుభవించు సుఖమేమున్నది. దీనికై విరాళిచెంది నీవిమలకీర్తికి మలినమేల తెచ్చుకొందువు? నీసోదరి సుధేష్ణాదేవి మహాపతివ్రత నీబావ విరటుండు ధర్మమార్గసంచారుండు. నీవన్ననో సత్కులప్రసూతుండవు. నీచమార్గంబు ననుసరించుట మంచిదికాదు. పరసతీ గమనము మహాపాపము. నలుగురిలో దలదిప్పుకొని తగవులు దిద్దు నీవే యిట్టితెఱంగున నన్యాయవృత్తిని జరించిన యిఁక యితరులమాట చెప్పవలసినదేమున్నది న్యాయమార్గానువర్తి యగువానికి సర్వవిధంబుల సౌఖ్యపరంపరలు కలుగును. నామీఁది వలపు మరల్చుకొని క్షేమంబుననుండుము.

కీచ — పరసతీగమనము మహాపాపమని నీవు వచించినది సత్యమేకాని-

గీ. దుష్టమదనాస్త్రకీలలఁ । దూలితూలి
కాయమును బాయఁబొల్పుడు । కాలమందు
కాచి రక్షణ మొనరించు । ఘనఫలంబు
వేదకుండంగ గలిగిన । విడువఁదగునె.

కరుణ మీఱ నన్నేలికొని ప్రాణదాన మహాఫలంబును బొందుము.
నీవాడ నన్నిప్పుడు విడచుట ధర్మముకాదు.

సైరం — రాజా! నీవెంతగఁజెప్పిన వినవొల్లకుంటివి. నాకు బలపరాక్రమసంపన్నులగు బతులైదుగురు గంధర్వులున్నారు. వారు నీకాయంబు నిరపాయంబుగ నుండనీయరు. ఎందుకు వీతిహోత్రునిలోఁబడు శలభంబు మాడ్కిఁ జరింతువు. (తనలో) అక్కటా!

సీ. ద్రుపదమహారాజ । దుహితనై పావన
హోమగుండంబున । నుద్భవించి

వైరిదుర్మదభంజ । నారంభ శౌండులౌ
పాండుకుమారుల । పత్నినగుచు
బ్రహ్మాండభాండముల్ । రహిమీర దనకుక్షి
దాల్చు శ్రీకృష్ణు సో । దరినియగుచు
పరమపతివ్రతా । ప్రాభవంబున సరి
సాటిలేదన్న య । శంబుఁగనుచు
గీ. పరలం నన్నొకనీచుండు । కరము బెదరు
లేకఁ గోరెడు నక్కటా! । లేమ యెట్లు
శీలభంగంబు గాకుండ । నేలఁ దిరుగు
వారలు జగాన దలపగా । భయముపొడము.

కీచ—ఓహో! అదియా నీభయము నన్నుఁ జయింపఁగల వీరుడు మఱి యీలోకంబున గాదు. ముల్లోకంబులఁగూడ లేఁడు. నావంటి రసికుఁడు నీకెన్నటికి దొరకడు. నీయదృష్టము బాగుండుటచే నాకంటఁబడితివి లెమ్మా. వెడలుదము రమ్మా. నాపైఁదొక సారిగాంచినజాలు! యీజయంతునినయిన గన్నెత్తిచూడవు.

ద్రౌప—(ఊరకుండును.)

కీచ—సుందరీ! ఊరకొనుట యంగీకారసూచకమేగదా! ఇఁక నాల సింపనేల? మీయక్కగారి దర్శనం బిప్పుడు కాదు. మఱి యొకసారి చేసెదనులే. (అని అంట బోవును.)

ద్రౌప—(కోపములో) ఛీ! నీచాత్మా! ఊరకున్నకొలఁది మేరమీఱి పలుకుచుంటివి. నీకాంత నొకఁడు గవయఁగోరిన నీవు చూచి యూరకొందువా? నీ వాడుతోడఁబుట్టలేదా? మానమర్యాదలు నీకు లేవా? నీజన్మంబున నిర్మలవంశంబుగూడ దూషితం బయ్యె. నీవంటి యధమాధముండు పతివ్రతం గామించి మనఁగలఁడా? పోపొమ్ము. నన్నంటిన నీవంశంబు నిర్మూలంబు కాదా?

రావణాదులు పరసతీగమనదోషంబున కాదె పుత్రమిత్రసహి
తంబుగ నశించిరి.

కీచ—(నవ్వుచు) మదగజగామినీ! దుర్బలులగు రావణాదుల సంగతి
చెప్పి నన్ను భయపెట్టుచుంటివా! నాయెదుట ముప్పదిమూడు
కోట్ల దేవతలు వచ్చినను నిలువఁజాలరు. నీవాగ్రహించి పలుకు
పలుకులు నాచెవులకు సుధారసపు గుటకల వలె నొలెయు విం
దొనర్చుచున్నవి. నిన్నొక తగాఁగొని మదనుండు మదీయహృద
య వజ్రప్రాసాదంబు విడగొట్టి భిన్నభిన్నంబులు చేసినాడు
ఇఁక నిలువఁజాల నీబిగికౌఁగిటఁ జేర్చి నన్ను మృత్యువాతనుం
డి కాపాడుము. నీకటాక్షము నాపైఁ బరపుము.

ద్రౌప—(తనలో) ఉచితానుచితజ్ఞానశూన్యుండగు వీనితో సంభాషిం
పరాదు కావున సుధేష్ణాదేవి లేచినతర్వాత వచ్చెదను. (ప్రకా)
నీతో సంభాషింప నవసరము నాకేమి? (అనినిష్క్రమించును)

కీచ—ఆహా! ఆమెరుపుతీవ, రతనాలకుప్ప, బంగరుశెలాక, కందర్పుని
చేతి బంతి విరులదొంతి యదృశ్యమైనదే. అయ్యయ్యో! మదీ
యహృదయభేదనంబు గావించు పంచబాణుని బాణపరంపరల
కెట్లు భరింతు. అక్కటా! మదనా! ఇంతచలము నీకుఁ దగదు
అదిగో నాయక్క సుధేష్ణ లేచుచున్నది సమీపించి దీని
యుదంతంబంతయు నాలించెదను.

సుధే—(లేచుచున్నది.)

కీచ—(సమీపించును.)

సుధే—తమ్ముడా! యిటురమ్ము కూర్చుండుము. ఎంతసేపయివచ్చితివి.

కీచ—(కూర్చుండి) అక్కా! ఎంతయో సేపు కాలేదు. నీచెంత నొక
సుందరి నిలచియుండెనే? అది యెవ్వరు? ఎన్నిదినంబులనుండి
నీదగ్గర సేవ చేయుచున్నది?

సుధే—(తనలో) మాలిని నీతఁడు చూదియుండెనాయేమి? ప్రమాదము సంభవించినదే? దానికి గంధర్వు లేవురు పతులు కలరు. వారలిగినచో మాబోంట్లు కుశలంబున మనఁజాలరు (ప్రకా) తమ్ముఁడా! అది మాలినియను సైరంధ్రిజాతిలోనిది. నీయంతఃపురంబున దానినిమించిన సౌందర్యరూపవిభవవిలసితలక్షణసంపన్నులగు విలాసవతు లనేకులుండఁగా దీని గామించితివా యేమి? నీకు రాఁగు సైరంధ్రిని గోరుటకు నీస్వాంతం బెట్లు సమ్మతించినది. ఇది విన్న లోకులుం గేలిసేయరా? చాలు చాలు. మంచిబుద్ధియుంతుఁడవె.

కీచ—అక్కా! ఎందు కీకొఱగానిమాటలు.

గీ. మూఁడు లోకంబులందలి । పూవుఁబోఁడు
లరయ దీనిపాద నఖంబు । కైనఁగాని
సాటిరారంచు శపథంబు । జరచి చెప్ప
వచ్చు మదనాస్త్ర మాననొవ్వ । వఁతి యహహా!

ఆజగన్మోహనాంగి, ఆసుందరవదనారవింద, ఆకులుకుగుబ్బలవగలాడి, ఆనవసరోజదళాయతాక్షి, ఆదివ్యమంగళవిగ్రహ, ఆపరహ్మాదయద్రైశ్యప్రాసాద నిర్భేదన మూలమహామ త్రము, ఆకర్పూరగంధి, ఆమధురవాగ్నిపుణ, ఆయించువిలుకాని మాయావాగుర, ఆయపరరతీసమానవిలాస, ఆచిన్నారి, ఆవగలమిటారి, ఆనడబెడంగుల రాయంచల వాసించు మరాళగామిని, నాకనులలోనిప్రకాశము, అసుందరితోడిపొందు నాకందకున్న నీడే ఱాంబున నీప్రాణంబులు స్థిరత్వంబున నుండగలవా? అక్కా! నన్నుబ్రదికింపదలఁచితేని యాసౌందర్యవతితోడ కూటమి ఘటింపుము. నీపాదంబుల కిదె ప్రణమిల్లుచుంటిని.

(అని నమస్కరించును.)

సుధే—సోదరా! ఎంతటివెఱ్ఱివాఁడవు. తనకులరూపంబులకుదగిన కాం
తలతోఁ గలయనగునుగాని నీచురాలిని గోరరాదు.

కీచ—అక్కా ఎందులకు నన్ను మరల్పఁజూచెదవు?

సుధే—(తనలో) వీని కాయువు మూడినది. నాలిని కైదుగురుగం
ధర్వపతు లున్నారు. వారు బలపరాక్రమవంతులు. వారితో
విరోధించి మనుట మనుష్యమాత్రులకు శక్యంబుగాదు. వీఁడు
దురభిమాని. మాటల వృథాపోవువాఁడుకాదు అయినను సా
ధ్యమైనంతవరకు వీని మనంబు మరలించి చూచెదను. (ప్రకా)
తమ్ముఁడా! దానికి మహాసాహసశౌర్యబలసంపన్నులగు గంధ
ర్వులేవురుపతులు కలరు. వారితోఁగలహము పెంచికొనరాదు.
ఇట్టికార్యమున మానమర్యాదలుపోవును. తుదకు ప్రాణహాని
కూడ రావచ్చును. కావున నీకనురూపవతులతోఁ గలిసి మెల
సి వర్తింపుము.

కీచ—సోదరీ! దానికేవురు పతులుకలరని నన్నుభయపెట్టజూచెదవా?

క. పలువురు గంధర్వపతుల్
గలరని నాతోడ బల్క / గా వింటిగదే
బలమున శౌర్యంబున మరి
తులయగుదురె వారు తో / యజవదనా!

నాశౌర్య బలోత్సాహంబులు నీవెఱుఁగవా?

మ. చల మొప్పారఁగ నన్నుదాఁకి కలన / న్నాధిపఁ గాఁ జాలు మే
ల్బలవంతుండు వసుంధరాస్థలిని నే / న్వాఁడుండె జూపింపుమా
లలనా! వ్యర్థముగాఁక బల్కెదవు నా / లస్యం బికేలా సతిం
బిలువంబంపి వశంబొనర్పుము మది / న్వేగంబు వేగయ్యెడిన్.

నన్ను ప్రాణభీతివారింపకుము. ఆకాంతంగూడకున్న గంతుశరాహతిని
గాయంబు వాయుట నిక్కువము. నాజీవితంబు స్థిరంబుగ నిలు
పం దలంచితివేని నాకోర్కె సఫలంబు సేయుము.

సుధే—తమ్ముఁడా! కీచకా! నీవు నామాటలఁ ద్రోసివేయుచున్నావు. పరకాంతమీఁది వలపు మంచిదికాదు. ఎట్లయిన నీబుద్ధి మరల్చుకొని సుఖంబుండుము.

కీచ—సోదరీ! నాకోరిక దీర్పనెంచక ధర్మోపన్యాసంబు లిచ్చినంత మాత్రమున దృప్తికాదు. ఇంతవరకు నాపైనీకు బాతృవాత్సల్యము కలదని నమ్మియుంటిని. నేడది కల్లయని తెలసివది. (దీనత్వంబుగఁజూచును.)

సుధే—(తనలో) వీనికర్మమున కెవరుకర్తలు. నయమున భయమున నెన్నివిధంబులనో బోధించిచూచితినిగానివినలేదు. సైరంధ్రిపర మపతివ్రత దానికైదుగురుపతులు గంధర్వులున్నారు. ఆత్మగౌరవముగలమహాశీలయగుసతినిగోరువానికాయువుస్థిరంబుగనిలువగలదా? రావణుడంతవాడు సీతామహాదేవిని గోరి సకుటుంబముగ నశించెను. ఇంద్రపదవి నందిన నహుషుండు శచీదేవి కారణమున నజగరమయ్యెను. సకలగీర్వాణమకుటమణిగణపాదాలంకృతుండగు స్వర్గాధిపతి యహల్యాగోరి సహస్రాక్షుండయ్యె నిఖిల లోకానందకరుండగు సుధాకరుండు గురుభార్యాగమనదోషంబున శంకియయ్యెను వీరందఱికంటె వీఁడెంతు గొప్పవాఁడు అటు గంధర్వులచేతను, ఇటు సైరంధ్రివియోగతాపంబున నెటుఁయిన నీహబలుఁడు చావకతప్పదు. అటు నూయియు నిటు గోయియునలె నామనంబు చింతాక్రాంతంబగుచున్నది. కావున నేను మాటనక్కంచుకొందును. (ప్రకా) కీచకా! నీకు దానియందే మక్కువ మిక్కుటముగఁ గలదేని నీసౌధంబునకు మధురసంబుదెచ్చు మిష చేబంపెదను. నీకోరిక సఫలంబు చేసికొనుము. విచారము మాని నిలయంబునకేగుము.

కీచ—అక్కా! నీవాక్యంబులు యథార్థంబులేనా? నేను నమ్మి యింటి కేగవచ్చునా?

సుధే—నీవు సంశయింపకుము. తప్పక పంపించెదను.

కీచ—సోదరీ! మరచి పోయెదవేమో?

సుధే—మరచిపోవను. నీవు వెళ్ళుము.

కీచ—అక్కా! సుధేష్ణా! వన్నుమరచిపోకుము (అని నిష్క్రమించును.)

సుధే—(దిక్కులు చూచుచు) సైరంధ్రీ! సైరంధ్రీ!

ద్రౌ—(ప్రవేశించి) అమ్మా యేమియనుజ్ఞ.

సుధే—(తనలో)అక్కటకటా! ఈమెనెట్లీ నీచకార్యంబునకు నియోగింతును? మొదటనే నీచకార్యంబులకుఁ జొరవనుమని ప్రార్థించినది. అట్టిస్థితిలో నీమెను బరగృహంబున కేగుమనిపలుక నోరెట్లాడును? పంపకున్న సింహబలుండు దేహాంతంబునొందు. ఎట్లయిన నీమెను బ్రార్థించి పంపించెదను. (ప్రకా) మాలినీ! శిరోవేదన యధికంబుగనున్నది. మధురసం బానినగాని శమింపదు. అది నాతమ్ముఁడగు కీచకునియింటనున్నది. నీవక్కడ కేగి తీసికొనిరమ్ము

ద్రౌప—(తనలో) ఆహా! ఇప్పుడేమిచేయవచ్చును. కీచకుఁడాడిన నుడువులందే నాయందు మక్కువకలదని తెల్లంబయినది. ఆదుష్టుని యింటికెట్లుపోవుదును. ఈమె మమ్ములనాశ్రయమిచ్చి పోషించుచున్నది. అట్టిసమయములో నీమె యుల్లంఘనము నర్చుట భావ్యముకాదు. అయిన నిట్లనెదను. (ప్రకా) అమ్మా నేను మొదటనే నీచకార్యముల పొంతఁ బోననియు పరపురుషుల యిండ్లకేగననియు నాత్మగౌరవమునకు హానివచ్చు విషయమున బ్రవేశింపననియుఁగోరి నీకడఁ బ్రవేశించితిని. ఇప్పుడు కీచకుని యింటికిఁ బోయినను యాత్మగౌరవమునకు భంగము

గలుగు నని శంకించుచుంటిని. ఆత్మగౌరవము స్త్రీజీవితిని ముఖ్యాలంకారము. మర్యాదఁగోల్పోయి జీవించినందున ఫల మేమియును లేదు. నీవు రాజపత్నివి మాకాశ్రయమిచ్చి మను చుచున్నదానవు. నాగౌరవమునకు గలంకము దెచ్చికొనినైన నీపంపుసేయుట నాకుగర్తవ్యమైనను బరపురుషుని గృహంబున కేగఁజాలను. నాయందు దయయుంచి మరియొకరి నీపనికి నియమింపుము.

సుధే—(తనలో) జవాబునకునందుదొరకకుండ వచించినది. ఐన నీవ్ర కారముగఁ బలికిచూచెదను. (ప్రకా) సైరంధ్రీ! నేనొకటియును తమ్ముఁడొకటియునా? వానియిల్లునీకుబరగృహమా? మధురసం బుపై వాసపడితిగాననిన్నింతఁగఁ బ్రార్థించుచుంటిని. నామాట బాటింపకున్న నేనేమిసేయుదును. సఖీధర్మము పాటింపవైతివి.

ద్రౌప—ఈమెనిష్ఠూరములాడఁజొచ్చినది. ఆనీచునికుటిలో నీమెయు జేరియుండునా? కానిమ్ము. కాగలకార్యము కాకమానదు. (ప్రకా) అమ్మా! ఆగ్రహింపకుము. సువర్ణచషకంబున మధు రసంబు దెచ్చెదను.

సుధే—వేగరమ్ము. (అని నిష్క్రమించును.)

ద్రౌప—హా పరమాత్మా! జగదీశ్వరా! కృపాకరా! ఆదిమధ్యాంత రహితా! ఆపద్బాంధవా! ఆర్తత్రాణపరాయణా! నారాయణా! పరమపురుషా! సకలచరాస్థితా! నాయేలికసానియగు సుధేష్ణా దేవియాజ్ఞచేఁ గీచకునియింటికిఁ బోవుచుంటిని. నాకొకవిపత్తు రాకుండ గాపాడుము పద్మినీమానసాంభోజమిత్రా! కర్మసాక్షీ! సూర్యనారాయణమూర్తీ! నన్నుగాపాడ నీదెభారంబు. ప్రతి వారలొనర్చు సకల సుకర్మ దుష్కర్మలకు నీవేసాక్షీభూతుం డవు. నీవు గాంచనిదెద్దియును లేదు. (దోసిలియొగ్గి)

## దండకము.

శ్రీసూర్యనారాయణా! లోకరక్షామణీ! సాధులోకస్తుతా!
పద్మిని మానసాంభోజమిత్రా! త్రిమూర్త్యాత్మరూపా!
ప్రదీపా! సదానిన్ను సేవించు భక్తాళిదుష్కర్మపాశంబులం
ద్రుంతువజ్ఞానపుంజీకటింబాపు జ్యోతిస్స్వరూపుండ వీవెన్నగా
రేబగల్ నీదుసంచారమై గాలరూపంబునై యొప్పగాదే త్వ
దీయంబైన కారుణ్యభావంబునం జేసి యాఘోరకాంతార
దుర్గంబులం బ్రాహ్మణవ్రాతముం దన్ని సత్కీర్తి గంటింగదే
దేవ! దేవాదిదేవా! ఖలుండైన యాకీచకావాసముం జేరి నాదే
విదాహంబు వారింప మద్యంబు దేనేగు నాకీయెడం గీచకుం
డాపదం జేయకుండంగ రక్షించి నన్బ్రోచవే కర్మసాక్షీ! యుగా
వల్లభా! మన్మనోభావమింతైన దూష్యంబుగాకున్న మద్భర్త
లౌపాండవుల్ సాధుమార్గంబునన్ న్యాయరూపంబున న్వైవితం
డంబులందుంచి యౌన్నత్యముం బొందువారైన మద్వాంఛ
నీడేర్చి కాపాడుమో వాసరేశా! సురేశాదివంద్యా! నమస్తే
నమస్తేనమః.

(నిష్క్రమించును.)







శ్రీశారదాంబాయనమః.

# పాండవాజ్ఞాతవాసము

## తృతీయాంకము.

---

రంగము—కీచకునిమందిరము.

(కీచకుడు ప్రవేశించును.)

కీచ—(విరహముతో) ఆహా! త్రిలోకమోహనవిగ్రహమగు సైరంధ్రి నిదలంచిన నాస్వాంతం వివశత్వంబునొందుచున్నది. నాయక్క గారగుసుధేష్ణాదేవి యాసుందరింబంపెదనని యింతవరకు పంప లేదు. కారణమెద్దియో తెలియకున్నది.

మత్తకోకిల. మారుబాళికిఁ దాళలేకను । మానసంబునవేగుచుం
గోరియుంటినితన్విఁగూర్పఁగఁ । గోమలాంగిరా మెంతయుఁ
వైరిభావములోడనన్నిటు । వంచితుండగఁజేయఁగ
నెరమేమియొనర్చి తీమెడ । నిశ్చయింపఁగలేనుగా.

మత్తకో. కాముఁడేసెఁకుపూవుటమ్ముల । గాయమెల్లనుదూపగా
భామినీమణిఁగూడకున్నను । ప్రాణవాలముకాసెడిన్
సేమమొందెడు దారిగానను । చెల్వనీకడకంటి పీ
యూషమృతంబున నాదుతాపము । నార్పిబ్రోవవె వేగనే.

శత్రువులతో సంగరరంగమునకుం బోయినప్పటి నిశాతబాణపరంపరల జవిజూచితివి గాని యింతహృదయబాధకంబులు కాలేదె. (ద్రౌపదినుద్దేశించి) హా! సుందరాంగి! సైరంధ్రీ! నాపరాక్రమము పాటింపవైతివి. నీవు సుకుమారివి. కాని నీహృదయము మాత్రము వజ్రమయమయి దుస్ఛేద్యమైనదిసుమీ? నీవు పరేంగితజ్ఞవుగాని నాహృదయముమాత్రము గ్రహింపనేరవైతివి. కాంతలయందునీవు శిరోమణివని యెన్నవచ్చును. గాని నాకాంతవుగావైతివి. నీవు పతివ్రతవేయైన నైదుగురగూడ గతంబేమి? నీరూపము జగన్మోహనమైనది. నేనుమాత్రము కందర్పసమాన సౌందర్యవంతుడనుకానా? (యించుక యూరకుండి) ఆయింతికి నాపై మోహములేకపోలేదు. ఏమది?

గీ. కాంత యచ్చోటువాసెడు । కాలమందు
నన్ను క్రీగంట గాంచుచు । నడచెగాదె
నతికిమోహంబు లేకున్న । గతులయందు
వన్నెచిన్నెలగాన్పించు । భావమేల?

ఇంతుల హావభావవిలాసము లత్యద్భుతములు, పైకిమిగులం గోపించినట్లు కాన్పించినను మనంబున మిక్కిలిప్రేమింతురు. పైకి నల్లిబెల్లిమాటలాడుచు గౌర్యము హృదయంబునబూనుదురు. క్షణక్షణము చిత్తస్థిరత్వమింతులకులేదు. ఉరిమిన మేఘమే వర్షించును. నాయక్కగారి యాజ్ఞబూని యాకాంతామణితప్పక నా సౌధంబునకు రాగలదు. వచ్చి మత్కామితంబీడేర్పగలదు. (యించుకయూరకుండి) కామదేవా! నీకుశతవందనంబులొనర్చెద.

గీ. కరకుటమ్ముల హృదయమ్ము । గాయపరచి
బాధపెట్టుచునుంటివి । ఖళిరమార!

నన్ను నేచినశరములు । నాపైఁగూడ
వైచి బాధింపరాదొకో । పంచబాణ.

మారా! లక్ష్మీకుమారా! నీవు చాలమంచివాడవు. విరహుల బాధించు గుణ మొక్కటియే నీయాధిక్యమునకు దగినది. నీవింతగర్వించు కారణము నాకు తెలియఁబోలేదు. అలతాతన్వి నాదరి లేకుంటచే నీగర్వము మేరమీరినది. నీదర్పమింక యెంత కాలముండును లే. నాయక్కగారామెతోఁ జెప్పి యీసరికిఁ బంపియే యుండును. జలజాక్షు లెప్పుడు నలసగమనలు కదా! అందుచే నిచటికి వచ్చుట యాలస్యమై యుండవచ్చును. (ఆలోచించి) ఒక వేళ నాయక్కగారగు సుధేష్ణాదేవి యామెతో వచించుట మరచిపోయెనా? అట్లైన్నటికినిమరచిపోవదే? సైరంధ్రియామె యుత్తరవుల మన్నింప నొల్లకుండెనా? అదియు సంభవముగాఁ గాన్పింపదు.

మత్తకో. వారిజానన వచ్చుజాడదె । పాదముల్ ధ్వనియయ్యెడున్
మేరమీరున నంగదర్పము । మీటసాగుదునిప్పుడే
ధీరచిత్తము తోడ మానిని । దివ్యమూర్తి గనుంగొనం
గోరికల్గదు సిద్ధిబొందెడు । కుంభినీస్థలి చిత్రమా.

(నలుదిక్కులం పరికించి) అరరే! ఆమదమతి నాతడయుచున్నదే.

గీ. నిముష మొక యేడులాగయ్యె । నెలఁతమిన్న
కంటబడకున్నఁగాయంబు । మంటగలియు
నెట్లు గడచెద నీతావు । మింటిఁగూడ
కున్న వేఱొకగతినాకు । నెన్నగలదె.

ఆహా! నాభాగ్యోదయం బుదయించుచున్నది. అల్లదె స్వర్ణచషకంబుఁ జేతఁదాల్చి మందమంద గమనంబున సుందర వదనారవింద

మై కన్నులకు విందొనర్చుచు నిటువచ్చుచున్నది. నేఁడుగదా నాజననంబు సార్థకమైనది. ఏమిరామణీయకము?

గీ. ఘోరకానన సీమల । గొంకులేక
తపముగావించు మునివరుల్ । తథ్యముగను
బడఁతి వీక్షించినంతనె । వరమువిడ్చి
భస్మమొనరించి వెనువెంట । బడుటయురుడె

[ద్రౌపది యొకపాత్రతోఁ బ్రవేశించుచున్నది.]

ద్రౌప—(తనలో) ఆహా! సేవకసేవ్యులయం దెంత తారతమ్య మున్నది? సేవకుడు తనకిష్టమున్నను లేకున్నను స్వామియా నతిమై వర్తింపకతీరదు. ప్రభునియొక్క కార్యము లందెంతయు బ్రాలుమానరాదు. తనకుదోఁచిన ప్రత్యుత్తరము పలుకరాదు. న్యాయాన్యాయవిచక్షణమందుఁ గొంచెమేని యధికారము సేవకునియందు లేదు. నేడు నాదేవియగు సుధేష్ణ మధురసంబు దెచ్చుటకై నన్ను కీచకునియింటికిఁ బంపినది. కీచకుడు నన్ను గామించి పలుదుర్భాషలాడియున్నాడు. వానియింటికి బోవుట నాకు దగనిపని. ఐన నామె యాజ్ఞానుసారంబుగ రాకతప్పినదికాదు. ఇద్దురాత్మునివలన నాకొకకీడు పొరయకుండ నాజగదీశ్వరునియందు భారమువైచి యేగెదను. మధురసంబిమ్మని యడిగెదను. ఇచ్చినమంచిది. ఈయకున్న వెంటనే యచ్చోటి వాసి యవలఁజనెదను. (అని కీచకునిసమీపించును.)

కీచ—(తొందరతోఁగూడినసంభ్రమముతో) నావలపులపాసి! రమ్ము. ఏమి నాభాగ్యము! ఈదీనునియందు దయవచ్చినదా?

ద్రౌప—(భయము నభినయించుచున్నది.)

కీచ—పడంతీ! ఏలభీతిల్లెదవు? నేను నీకు బరుడనుగాను. నీకు నాయందు సంశయకారణము లేదే?

గీ నీవె గతియంచు నెదనమ్మి । నిక్కముగను
జేరి మదార్తిమునిఁగి ది । వేకమింత
లేక గిలగిలలాడుచు । వీఁకమెడలి
యున్న ననుజూచి భయమంద । నువెపచనునే.

తరుణీశిరోమాణిక్యమా! నీరాక నీరాకరంబునకు రాకయుం బోలె నా కింతేని మోదమొనర్చినది. ఇంతదనుక నన్ను మదనహతకుండు బాధించిన బాధయేమని చెప్పవచ్చును. ఇంక వాని గర్వము సర్వము నిర్మూలించెదను. నీకటాక్షము నాపైఁ బరగింపుము. కిన్నరధ్వనిఁబోలు కంఠంబెత్తి యొక పలుకు పలుకుము.

సైరంధ్రి—(తనలో) ఈ నీచుఁడింకను నాయెడ దుష్టభావంబు మానలేదు. నిశ్చయముగ వీనికిఁ గాలమాసన్నమైనది. అయ్యయో! వంటరిగ వీనిసౌధంబునకువచ్చితినే. ఏమిమోసంబు వచ్చునోకదా! వీఁడు నన్నేమిచేయఁగలఁడు? నన్ను కంటికిఱెప్పవలె గాచు నారుక్మిణీకాంతుఁడే నాపాలఁగలఁడు. హా! మహానుభావా! ద్వారకావాసా! జగన్నివాసా! నీసోదరిని గావను సమయమిదే. ఈ దురాత్మునిచే నాకెట్టికీడు రాకుండ కాపాడుము. (ఆలోచించి) ఆలస్యమొనరింపనేల? మద్దేవి యాజ్ఞానుసారంబుగ నీతని మధురసంబిమ్మని యడిగెదను. ఇచ్చిననిచ్చు లేకున్న సత్వరంబుగ నిచ్చోటివాసి యేఁగవలయును. (ప్రకా) రాజా! నీతో నాకనుచితభాషణము లేల? నీయక్కయగు సుధేష్ణాదేవి దాహముకొని మధురసంబు గొనిరమ్మని పంపించినది. కావున యయ్యది యొసంగిన నేనేగెదను. నాకొఱకు కనిపెట్టుకొనియుండును.

కీచ—పద్మాక్షీ! నాయక్కగారి తృష్ణమాన్పవచ్చినదానవు. నీవింత తొందరపడెదవేల?

గీ. వసంతి నాయక్క తృష్ణఁ దీ । ర్పఁగఁ దలఁచి
వచ్చియుంటివి యెంతయు । బ్రీతిగాఁ జె
నామె సోదరుఁడయిన నీ । వా బలత్తృష్ణ
దీర్పకుండుటతగునె పో । తెరవమిన్న!

నీయధరసుధారసపానం బొసంగి పానీయంతాపశిష్టుండనగు నన్ను రక్షింపుము. మదనకదనంబున నన్నేలికొనుము, తాళిమి నిలువ జాలను.

దాసి — రాజా! నేను నిర్వికారహృదయునని యింతకుముందే వచించియుంటిని. నన్ను గోరినందున నీకు లాభమింతయు లేదు. నీయందనురాగవతులగు సతుల గలసి మెలసి సుఖింపుము. నీయక్క నాకొఱకెదురు చూచుచుండును. దాహాతురము పీడింపఁబడుచున్నది. ఆలస్యమైనచో నామె కోపించును. శీఘ్రము మధురసం బిచ్చి నన్ను బంపించుము.

కీచ — సుందరీరత్నమా! నిన్ను బాపింపక నాయొద్దనే నిలవయుంచుకొందునా? సందియమందకుము.

చ. అధరసుధారసం బొసఁగి । యక్కరదీరిచియేఁగుమీవె స
న్మధువుననుగొంచు నక్కకడ । మాటలికేలసుధాకరాననా!
వ్యధనిధనంబు జేయకను । బాధలఁబెట్టుట మేలుకాదు స
త్పథమున నేగనీకగును । భాగ్యము భోగము సర్వసౌఖ్యముల్.

మత్కులకాంతలెల్లరు నీకు సేవకురాండ్రయి సదా నిన్ను సేవించునట్లు కట్టడి చేసెదను. నీకనుసన్నల నన్ను మెలపుకొనుము. ఈమాసిన కోక విడచి చీనిచీనాంబరంబుల ధరించి బహురత్నసరంబు లురతఁ గీలింపుము. అక్కగారికడకు మధురసంబు పరులచేఁ బంపించెదను. నీసల్లాపసౌఖ్యంబుల వినోదింపనిమ్ము.

నీను ఖచంద్రి జ్యోత్స్నలఁ బ్రసరింపఁజేసి మన్మనోచాతకంబు తృప్తినందింపుము నీకరం బిమ్ము. (అని చేయిపట్టుకొనబోవును)

ద్రౌప—(కోపముతో) ఛీదురాత్మా! ఊరకున్నకొలఁది నీకండగర్వము మీరమీరుచున్నది. సామదానభేదదండంబుల నెట్లు చెప్పినను వినకుంటివి. నీకాయువు మూడినది కనుకనే యిట్టిదుష్కార్యాచరణమునకై కడంగితివి! నిన్ను జంపఁగలశక్తి నాకున్నను మత్పతులయనుమతి లేకుండుటచేఁ జంపక విడచితిని. పోపొమ్ము.

(అని పాత్రి నచట బడవైచి వెడలిపోవుచున్నది)

కీచ—(కోపముతో) ఓసీ కులటా! నన్నుఁ దిరస్కరించిపోదువా? ఎట్లు పోఁగలవో చూచెదనుగాక! (అని వెంటాడించును.)

ద్రౌప—హా! దీనజనావనా! ద్వారకావాసా! జగన్నివాసా! పరమపురుషా! విదూరాకూరవరదా! గజరాజపాణత్రాణదక్షా! నవనీరజదళాయతాక్షా! శ్రీవత్సవక్షా! విశ్వరూపప్రదర్శకా! సకలచరాచరస్థితా! కుక్షిస్థితబ్రహ్మాండమండలా! ఆపన్నివారణా! ఆదిమధ్యాంతరహితా! పరాత్పరా! పదనీరజపరమపావనగంగా! కరధృతవదాంగా! విశ్వమోహనరూపా! దూరీకృతసాధుసంతాపా! ఈదుర్మార్గుండు నన్ను వెన్నంటి తరుముకొనివచ్చుచున్నాడు. నాకాపద రాకుండ గాపాడుము. (అని పరుగెత్తుచున్నది.)

[ఒక రాక్షసుఁడు ప్రవేశించి]

రాక్ష—ఓరీ! నీచుఁడా! పరమపతివ్రత నంటఁజూచెదవా?

శా. ఔరౌరా! మది కండకావరముచే । నౌచిత్యహీనుండవై
సారంగాక్షిని బట్టఁజూచితివె నీ । సత్వంబు దూలించెదం

గారుణ్యాత్ముఁడు దేవుఁడుండఁడె సదా । కాపాడి రక్షింపఁగాఁ
గూ్రిరా శిక్షనొనంగుచుంటిపదరా । క్షోణీస్థలిం ద్రెళ్ళఁగన్.

(అని తన్ని మాయమగును.)

కీచ—(తనలో) అన్నా వీఁడెవ్వఁడో కదా? ఇతేఁడు లోకంబు లకేడు లోకంబులంజూచి వచ్చునంతటి తన్నుతన్ని మాయమైనాడు. వీనిదాపుచే నేను తూలిపడుట నెవ్వరు కాంచ లేదుగదా! (అని లేచి) అయ్యయో! సైరంధ్రి దాటిపోయినదికదా! ఆఁ! ఎక్కడికి దాటిపోగలదు! (అని పరుగెత్తుచు నిష్క్రమించును.)

(తెర లేచును.)

(విరటురాజు కంకుభట్టు మొదలగువారు ప్రవేశింతురు.)

ద్రౌప—(ఏడ్చుచు ప్రవేశించి) హా! వాసుదేవా! ఆపద్బాంధవా! కరుణాసాగరా! దామోదరా! యాదవకుంజరా! గోవర్ధనాచలధరా! వేణుగానవినోదా! మునిరాణ్మానసహంసా! కదనసర్జితకంసా! పరమహంసా!

విర—(కంకుభట్టునుజూచి) మహాత్మా! ఏదియో స్త్రీయార్తరవంబు వినవచ్చుచున్నది. అది యేమైయుండునో కదా!

కంకు—(తనలో) ఈకంఠధ్వని ద్రౌపదీకంఠమువలె నున్నది. ఏమి యాపద వాటిల్లెనో కదా? (ప్రకా) అది మన మాలిని కంఠమువలె నున్నది. ఆమె కేమి యాపద వాటిల్లినదో? రాజేంద్రా! నాకును స్ఫురింపకున్నయది.

ద్రౌప—అహా! మాలదైవమా! నీచేత లతివిచిత్రంబులుకదా! సకల ధర్మాధర్మవిచక్షులై శిష్టరక్షణ దుష్టశిక్షణచణులై బాహువీర్య తేజోధుర్యులై యలరారు పతులేవురుగల నేనొకయనాథరీతి నొకదుర్మార్గునిచే నవమానింపఁబడి పొటాడింపఁబడుట కడు

యచ్చెరువుగదా! అక్కటకటా! ఈమత్స్యనాయకుఁడగు విరట మహీపాలుని యాస్థానంబున న్యాయంబు విచారించువాఁడొక్కరుండును లేఁడా? ఇంతమందిచూచుచుండ నానింద్యచరిత్రుఁడు నానుమానిఁ జేయఁదలఁచుచుండ నివారించు మేలిమి కాఁడు లేఁడా? అక్కటా! ఏ తగతిపట్టినది. ఈనరపాలుండు చూచుచుండియు నూరకుండెను. కారణం బిదియని పొడకట్టుచున్నయది. తనకన్న బలవంతుఁడగుటయె కావలయు. కాకున్న రాజు దుష్టశిక్షణగావించి న్యాయమార్గంబున నిలాతలంబు బాలింపఁడా! కటా! నాభర్తలైన నివారింపనెంచిరా? నాయదృష్టమిట్లున్నది

వీర—(తనలో) అయ్యయ్యో! ఎంతకష్టము. కీచకుండెట్టి నీచకార్యమొనర్ప సాహసించెను. బలవంతుఁడగు వాని నివారించు వాఁడెవరు నామాటవిను వాఁడు కాఁడు కదా? సుధేష్ణతోఁ జెప్పి వానిదుష్ప్రవృత్తి మాన్పింతును గాక! (నిష్క్రమించును)

కంకు—(తనలో) ఆహా! శూరాత్ముఁడగు సింహబలుఁడీమె నిట్లు పరాభవింపఁదలఁచెగా! ఎట్టి యకార్యంబులకైన నోర్చియుండు సమయము వచ్చినది. ఏవిధముగానైన నిచటనుండి రూపించవలయును లేకున్న యజ్ఞాతవాసభంగము రాఁగలదు. ఇఁకెన్ని దినములో లేవు. కష్టములు గట్టెక్కు దాపైయున్నది. (ప్రకా) పాంచాలి! ఈవిరటుండును సభ్యులును నీచరితం బంతయుఁ గాంచిరి. నీభర్తలగు గంధర్వులును గాంచియేయుందురు. సమయము గానివారూరకొందురు వారినిదూర నేల? నీయేలికసానియగు సుధేష్ణాదేవితో నీయుదంతంబు జెప్పికొనుము.

ద్రౌపది—అట్లే! (అన్యోక్తి)

కంకు—(వారించి)

గీ. పరిభవశిఖాహుతిని కొలువున । వనితవోల
కరము లిటునటు విప్పుచు । గణికరీతి
బల్కుచుంటివి కీచక । బాగుబాగు
పొమ్మునిలువక శుద్ధాంత । మునకు వేగ.

ద్రౌప—అయ్యో! నాభర్త నటుండు కావున నాకును గొంతవరిచితి నాట్యమునందుగలదు. మఱియు నావిభుండు జూదరిగూడనై యున్నాడు ఇట్టిస్థితిలో నాకు మర్యాదయుండునది యెట్టిది.

(కంకుభట్టు మొదలగువారు నిష్క్రమింతురు తెరవాలును.)

ద్రౌప—(నడచుచు) ఆహా! ఈవార్త సుధేష్ణతో (జెప్పినమాత్రమున నామె యేమిచేయగలదు? సమయభంగభయంబున ధర్మజుండు వారించి యేగెను! భీమసేనుడేమనునో కదా?

[భీముడు ప్రవేశించును.]

భీము—(ద్రౌపదిని సమీపించి) ఏమది! ద్రౌపదియేనా? సుందరీ! ఇట్లు శోకవిహ్వలచిత్తవై కడు శీఘ్రగతిని బోవుచుంటి వేమి? ఎవరివలననైన నీకుం గీడువాటిల్లలేదుకదా? సంగతియంతయు దాచక చెప్పుము. నాడెందంబునం దాందోళన ముద్భవించుచున్నది.

ద్రౌప—(ఏడ్చుచు) హా! నాథుడా! అరాతిమదభంజనచణుండును సబిడీకృత యశఃపరిపూర్ణదిక్కుహరుండు నగు ద్రుపద మహీశుని పుత్రికనై మహాబలపరాక్రమసంపన్నుండగు దృష్టద్యుమ్ను సోదరినై శూరాగ్రేసరులగు పాండుకుమారుల పత్నినై యుండియు నిట్టి దుస్థితిసంకట మాత్రము తప్పినది కాదుకదా!

భీము—ఏమి! నీకు నపరాధమాచరించిన ఖలుండెవ్వడు? ఇంకను జీవంబులతో నుండ సాహసించెనా?

ద్రౌప—నాథా! నాకు దిరిగి సంతాపము బెంచెదరేలా? ఎవనివలననైననేమి లాభము? మీరేమయిన నివారణచేసెదరుకనుకనా!

భీ—గీ. దుష్టుఁడెవ్వఁడు నీకట్టి । ద్రోహబుద్ధి
సంచరించెను జెప్పుమా । సత్వరముగ
వానిద్రుంచి నీశోకము । బాపువాఁడ
భీతసురంగనేత్రి! ని । ర్భీతిజెంద.

సుందరీమణీ! నీ అనుతాపకారణంబు దాపక నాతోడ వచింపుము.

ద్రౌప—(ఏడ్చుచు) నాథకా! నాసంతాపకారణము వచించిన మీరు సంతోషముతో వినెదరు గాఁబోలు.

భీము—(అనుతాపముతో) ప్రియా! అట్లనఁ జెల్లునా? నీతాపము మాన్పని నా మగతనమెందులకు?

ద్రౌప—నాథా! వినుఁడు చెప్పెదను. నేటి ప్రాతఃకాలంబున సుధేష్ణాదేవి సోదరుండగు కీచకుండు భగినీసందర్శనోత్సాహంబున జనుదెంచెను.

భీము—సరే! సుధేష్ణాదేవియందలి భక్తిభావంబున జనుదెంచుట ధర్మమే.

ద్రౌప—అతఁడు వచ్చునప్పటికి సుధేష్ణ నిద్రించుచుండెను. నేనామెను సేవింపుచుంటిని. అప్పుడా దురాత్ముఁడు (అర్ధోక్తి)

భీము—ఆఁ! ఏమి దురాత్ముఁడనుచుంటివి. అతఁడు నీకేమైన హానిచేయలేదుకదా? చెప్పుము చెప్పుము.

ద్రౌప—అప్పుడా దుష్టుఁడు నన్నువీక్షించి నాకులగోత్రంబులడిగెను. నేనాతనిమాటల వినిపించుకొనక యూరకొంటిని. వాఁడు కామాంధుఁడై కనులుగానక నన్నుగవయఁదలఁచి పెక్కుదెరంగుల బ్రార్థించెను. కాని నేనాచోటు కడురయంబున బాసితిని.

భీము—(కోపముతో) అరే దురాత్మా! పరాంగనాహరణమానసా! దురాచారా! ఏమిరా నీదురాగతము.

చ. పరసతిఁ దల్లిగాఁ దలఁచు । భావము వీడి సతీశిరోమణిన్
గరువముతోడఁ గూడ మది । గాఢమనహించితె దుష్టబుద్ధివై

సురపతి చేతికోతి హితి । సోలిన శైలముతీతి నిన్ను నీ
ధరణిని గూల్చువాడనిదె । దాకొనవిల్వము ధీరబుద్ధినై.

ధృవకో. కనులు గానవా కామినీమణి । గాము కేళినిగూడగా
మనములోపల నెంచి వాడవె । మంచిమార్గ మెదుష్టుఁడా
జనములెవ్వరు మంచిగాదని । క్రొద్ధబూనివచి ఘనో
వినియు వారల బోధనీసడి । వేగఁజేతువు మొంచగరా.

నీదేహము కండకండలుగ జీల్చి కాకులకు గ్రద్దలకు నైరగావించెదను.

[అని నడచుచున్నాడు.]

ద్రౌప—(భీముని బట్టుకొని) నాథా! శాంతింపుము శాంతింపుము. మీ రిట్లు క్రోధంబున వర్తింతురని దలంచినచో నేను వచింపక నే యుందును. మీరీవిధంబున వేగిరించిన మన-యజ్ఞాతవాసంబునకు భంగంబు రాగలదు.

భీము—(శాంతముతో) నీవు చెప్పినమాట సత్యమే. తరువాత నేమి జరిగినది.

ద్రౌప—తరువాత నాదుష్టుడు తన సహోదరితో నేమిమాటాడెనో కాని యించుకకాలము గూర్చుండియుండి తన సౌధమునకు వెడలిపోయెను. పిదప సుధేష్ణాదేవి నన్ను బిలచి దాహాభరంబున బీడింపబడుచుంటిననియు తన్నివారణార్థము మధురసము తన తమ్ముని సౌధంబునుండి తెమ్మనియు నాతో బంపెను. నేను బరపురుషునియింటికి వెళ్ళజాలనని యెంతయో బ్రతిమాలి చెప్పితిని కాని తుదకు వానియింటికేగక తప్పినది కాదు.

భీము—ఆఁ! ఏమి? సుధేష్ణకూడ యిట్టికార్యంబు దమ్మునికి సాయపడ నెంచెనా! ఆదురాత్మునకు బుద్ధిచెప్పి వాని దౌష్ట్యంబు మాన్పుటకుమారుగా నిన్ను వాని నివాసంబునకు బంపెనా? ఆమె కూడ దండ్యురాలె. పిదప.

ద్రౌప — మీదట నేనామె యానతి ననుసరించి సింహబలునికడ కేగి మధు రసంబిచ్చి సత్వరంబుగఁ బంపివేయుమని దూరంబుననుండి యుంటగితిని ఆదురాత్ముండిదినాకుగొనకసన్న నేకదూరాలాపంబు లాడె అప్పుడు నేనెన్నియో నీతులుపదేశించితిని. నాకేవురు మహాబలపరాక్రమ సంపన్నులగు గంధర్వపతులున్నారనియు మేరమీరి నడచిన నిన్ను తప్పక దండించి తీరుదురనియు గూడ వచించితిని కాని పైత్యరోగికి బంచదారయు జేదైనటుల నావాక్యంబులు వానికి రుచింపవయ్యె. ఆదూరాత్ముండు వానినెల్లఁ బెడచెవినిబెట్టి నన్ను బట్ట దలంప నే భయంబం దుచు వాని సౌధంబువిడచి మిక్కిలి వేగంబున బరుగెత్త సాగితిని వాఁడు నన్ను వెంటాడించెగాని మార్గమధ్యంబున నొకకీలవదను జుని చే వేటువడి సొక్కి తూలిపడిన నేను కడుశీఘ్రముగతిని విరా టుని సభాస్థలి జేరి యిదియంతయు వినిపించితినిగాని న్యాయంబు విచారించువారి నందు గాననైతిని. త్వదీయాగ్రజుండుకూడ సా ధ్వసభకెక్కి వారాంగనవలె నాట్యంబు సలుపుచు నిల్లు వ లుకుట పాడిగాదని పలికెను అంతట నేనచ్చోటువాసి వచ్చు చు నిచట మిమ్ము గలసికొంటిని. అద్దురాత్మునివలన భయం బున నించుకంతయు మదికి విశ్రాంతి కలుగకున్నది ఇప్పుడే మిహానివాటిల్లునోయని భయంబుగనురుచున్నది.

భీము — సుగుణా! నగలబాగులకును భీమసేన బాహుబల రక్షితవగు నీకేమిభయము?

శా. కాంతా! బల్కెనె "నాకు నేవురు విభుల్ గంధర్వులున్నా" రటం
చెంతేని న్వచియించినన్వితముగా పృథ్వీస్థలిం ధీరుఁడై
వంతంబొప్పఁగ నిల్చుగాక కలనం బంధించి వేధ్రించెదం
జింతన్వీడుము వాని కాయముచినం జీవుండ్రినుం గాంక్షతోన్.

తరుణీ! నీవు మత్స్యభూనాయకుని సభాస్థలంబున కేగినప్పుడు నీనోటినుండి యింకేమి పలుకవచ్చునో యను భావంబున ధర్మతనయుండట్లు పలికె. ఆమహామహుండు సాధారణ పృథ్వీశుల వంటి వాడుం గాడు. అజాతశత్రుండగు సార్థక నామ మొక యుధిష్ఠురునకె కాక యితరులకుం జెల్లునా? రాజసూయాధ్వరం బొనరించి దిగ్విజయము గాంచ సామాన్య భూపునివశమా? అట్టి ధర్మమార్గైకశీలుం డొకరుండు కలడా? ఆపురుషవరేణ్యుని ధర్మంబున నేకదా మనమిట్లు చెలంగుచుంటిమి అట్టిపుంభావనిధి యగు కుంతీసుతాగ్రజుండు బీదయై సన్యాసి వేషంబున నొరుని సేవించి యజ్ఞాతంబొనర్చుట న్యాయంబునకు లోంబడి కదా? ఆధర్మమూర్తి నీవేమయిన పలికి సమయభంగ మొనర్తువేమో యను శంకనట్లు పలికె గావలయు. ఇంక సింహబలుండు నాచేం జిక్కునని తలంపుము.

ద్రౌప — పాంచాలవిభుండు తనకుమారులకన్న గోమున బెంపం బెరిగి, సకల సద్గుణఖని యనదగు కుంతీదేవికిం గోడలనై యామెచేం గొండాడంబడి ప్రాణంబులకన్న మిన్నగ మీరు సంరక్షింపుచుండ వరలుచుండి, బాడబులచే మిక్కిలి స్తుతులగాంచి, రాజసూయాధ్వరంబున భూసుర నికరంబుచే నాశీర్వచనంబు లంది వారిని దృప్తినందించిమించి, పాండుమహీధవుని గోడలనని శుద్ధాంతనృపకాంతాజనంబుల బొగడ్తలగాంచిన నేనిపుడు సుధేష్ణకుం బరిచారికనై గంధంబుతీయుట పూలుగ్రుచ్చుటాదిగ గల్గుపనుల మెలంగవలసివచ్చె. నాకరంబు లెట్లు కాయలుకాచినవో కాంచుము (అని చూపుచున్నది.)

భీము — తరుణీ!

మ. దైవవంచన జేసియిప్పుడు । దాపురం బయ్యె గష్టముల్
భావికాలము భోగ్యమయ్యెడు । భాగ్యవైభవమందగతి
కావునన్మది జింతజెందగఁ । గాంత? వ్యర్థము సర్వదా
శ్రీవిభుం డనుకంపగూర్చెడు । శ్రేయముల్ తులఁతూగఁగన్.

భామినీమణీ! చింతదక్కుము!

ద్రౌప—హా! నాథా! నాడట్లు సభాభవనంబున దురాత్ముండగు దుస్ససేనుచే, బరాభవంబందియు జాకుంట నేఁడీకీచకునిచే వంచిత నగుటకే కాఁబోలు ఇఁక నాకెక్కడవిచారశాంతి. అయ్యో! ఇందులకు మీరేమిప్రతీకారముచేయుదురు. దైవవిధిదాటరానిదికదా? కావున మీ శ్రేయంబు మీరు చూచుకొనుఁడు. నే బుట్టినది మొదలు చింతలభరించుటచే నాహృదయంబు మోడుబారియున్నది ఎట్లయినభరించెద. దుర్గర్వంబున గనులుకానని యాదురాచారుని మీరు వధింపకున్న నేనట్లో ప్రాణంబులఁ బాయుదానను. లేకున్న శీలలక్షణము గావించుకొనఁ జాలను.

భీము—మత్ప్రియా! శంకవీడుము. రేపుతప్పకుండ వానిని దుదముట్టించెదను. రహస్యంబుఁగ వానిజంపవలయును. కాని యెదుటఁబడి త్రుంపరాదు. కావున రేపువానితో నీగోర్కెఁదీర్పన ర్తనశాలకు నొంటిగరమ్మనివచించుము. వాఁడేకాంతంబునవచ్చినాచేసంహరింపఁబడఁగలఁడు. మన యజ్ఞాతవత్సరంబు కూడపూర్తికావచ్చినది. పదునొకండునెలలు గతించి పదిరెండవనెలజరుగుచున్నది. మన దాయాదులగు దుర్యోధనాదులంబరిమార్చి విజయంబు గాంచునంతకును నాకు శాంతి జనింపదు నీశయనస్థానంబునకు బొమ్ము. ఎవరైనగాంచిన మనరహస్యంబు బయలుపడగలదు.

ఆ. వె. ఎల్లిసింహబలుని । నెల్లినజంపెద
శంకదక్కిచనుము । సారసాక్షి
చింతవీడుమింక । చెల్లెనాదుష్టుండు
పరమసాధ్వి నిన్ను । బనపుకతన.

ద్రౌపది—నాథా! నాకనుజ్ఞనీయుడు.

భీము—మంచిది.

(ఇరువురు చేరియొకవైపున నిష్క్రమింతురు.)





శ్రీ శారదాంబాయనమః

# పాండవాజ్ఞాతవాసము

## చతుర్థాంకము.

---

(ఒక వృద్ధకంచుకి ప్రవేశించుచున్నాడు.)

వృద్ధకంచుకి—ఆహా! ఆమహారాజెక్కడనున్నాడోకదా? కీచకమహారాజా! నిన్ను వెదకి వెదకి వేసారితిని. నీవుండుస్థలంబులన్నియు నొకటివెనుక నొకటి బాగుఁగ బరిశోధించితిని. నీకొఱకు రాణిగారు తల్లడిల్లుచున్నారు ఎక్కడను నీజాడ కాన్పించుటలేదు సరికదా యొకరును జూచినట్లు చెప్పుటలేదు. ఏమిచేయవచ్చును? అయ్యో! మాప్రభువైన కీచకమహారాజు నెచ్చటైన జూచితిరా! ఏమనుచున్నారు? ఇఁకెక్కడి కీచకుఁడా? అయ్యో! ఏమి యిట్లనుచున్నారు. (వినుట నభినయించి) నర్తనశాలలోఁ జంపబడి తలలు గోళికవలె దొర్లుచుండెనా? అయ్యయ్యో ఎంతదురవస్థ ఎంతదారుణము. ఈప్రకారమెవ్వరిచేఁ జంపబడెనో చెప్పగలరా? (మరల వినుట నభినయించి) ఏమనుచున్నారు. గంధర్వులచే నర్తనశాలయందు గూఢంబుగ సంహరింపఁబడెనా? అక్కటా! ఎంతటి యుదారుఁడుగదా? సేవకులయందలి వాత్సల్యము కీచకమహారాజునకే చెల్లినది. కటా! ఏమికారణమున గంధర్వులచే సంహరింపబడెనోకదా? ఏమనుచుంటిరి? సైరం

ధ్రసిమోహించి గంధర్వులచే దృంశబడెనా? సైరంధ్రియెవ రుచెప్పుమా? (జ్ఞప్తినభినయించుచు) సుధేష్ణాదేవిదగ్గరకుం గ్రొత్తగావచ్చి పనిచేయుచున్నదాసియా! రాజా! ఎంతబుద్ధి మంతుడవైనను పొరంబడితివికదా?

గీ. రూపయువ్వన విభవాభి । రూఢవైన
సతులుపలువురు కలిగియు । జనునెసాధ్వ
బరమపావనచరితను । వాంఛజేయు
దాటగశక్యమె యెవరికి । దైవనియతి.

మలినాంబరధారిణియై నీయక్కగారిని సేవించుచుండు పరిచారికను గోరి యామెకై దుర్మరణము నొందితివా? దైవమా? కాల గతి యెట్టివానిని కట్టికుడిపితీరును కదా? లోకమందున బలంబు న బ్రఖ్యాతిగాంచిన బిరుదు మగలలోం బేరెన్నికగన్న సింహ బల మహారాజే యిట్టి దుర్మరణమునందిన యింక చెప్పవలసిన దేమి? (యోచించి) పరసతీగమన మహాపాపము విటపుపేక్షం ధనములకు పీతిహోత్రముకదా? చిన్నితనమునుండియు రాజ కుటుంబమును సేవించుటచే బ్రేమంబున నిట్లు పలుకుచుంటిని. గాని కీచకుండెన్నడో యిట్టి సంసారిఘాతలోనచ్చియుంటెను. నూరుగొడ్లనుదిన్నరామబందున కొకటేగాలిపెట్టెను మాటయ బద్ధమా? ఏపుట్టలో నేపాముండునో కదా?

(నేపథ్యమున)

గీ. అనదనై తినిచట । నాలికుయ్యాలింపు
డకట మీరుగలుంగ । నాక్రమించి
నన్నుంగట్టి సూత । నందను లిమ్మోయి
తెలుపులేక భంగ । పరచువారె.

ఉ. ఆనలనైరిసోజయమ । హాద్భుశపకరిసు యోజయుంతదు
ర్మానవిఘూర్ణ మానరిపు । మర్దన మోపజయాభిధాన తే

జోనిహితాహితవ్రకట । శూరగుణ ప్రతిభాసయోజయ
త్సేన విరోధి బాహుబల । జృంభణ భంజనయోజయద్బలా.

సీ. తొడగిన వనిచలం । బెడపక యతిదుష్క
రంబైన కడతేయ । ప్రభువులారా!
పెనఁగిన వైవస్వ । తునినైనఁగడిమిమై
వేర్మిడి బరిమార్చు । వీరులార
శరణార్థియగు దుష్ట । శాత్రవునైనను
గరుణ రక్షించు న । త్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు । లైనను దావక
తమకించి యిచ్చు ను । దారులార

గీ. నాథులార గంధర్వర । త్నంబులార
నన్ను నుపకీచకులు దమ । యన్నశవము
నందు బంధించికొని వెస । నరుగుచున్న
వారు రక్షింప వేగరా । వలయు మీరు.

(విని) ఓహో! యీయాక్రందనధ్వని స్త్రీకంఠమును బోలియున్నదే. పోలియుండుటయేల? స్త్రీకంఠధ్వనియే సైరంధ్రిని నుపకీచకులు తమ యన్నశవముమీఁద బంధించి కొనిపోవుచుండిరా? ఎంతదారుణము. అన్న గంధర్వులచేత మడిసెనని తెలిసి నా సాధ్వి కట్లు ద్రోహంబుసేయ సాహసించిరే? అయ్యో! ఉప కీచకులారా! మీరయిన తిన్నగనుందరా? ఏమిదుర్వార్త చెవి నిఁబడునో? మిమ్మేల నాయిరటుండైన వారింపలేదా? అదిగో! ఎవరో వచ్చుచున్నట్లున్నారు, నాయనా! వచ్చువారెవరు?

[యశోలతిక ప్రవేశించుచున్నది.]

యశో—మాదేవియగు సుధేష్ణ నూర్వురు సోదరులును సింహబలుఁ డును మరణించుట విని మిక్కిలి వ్యాకులత్వంబునఁ బరితపించు

చున్నది. ఎవరెన్నివిధంబులఁ బ్రబోధించినను లేవకున్నది. మహారాజుగారిని దోడితెచ్చి నామె దేర్ప యిటువచ్చుచుంటిని.

వృ॥ కం—ఎవరా వెళ్ళువారు?

యశో—తాతా! నేను యశోలతికను.

వృ॥ కం—నీకండ్లకు నేను తాతవలె గన్పడుచున్నానా? ఎక్కడికి వెళ్ళుచుంటివి?

యశో—తాతవుకావా? విరటమహీనాథుని దోడితెచ్చుటకై యేగుచుంటిని.

వృ॥ కం—ఎందులకు?

యశో—సుధేష్ణాదేవినోదార్చుటకై రాజుగారిని దీసికొనివచ్చుటకు వెళ్ళుచుంటిని.

వృ॥ కం—అవును. కీచకమహారాజు మరణించుటచే నామెదుఃఖము సహింపరానిది.

యశో—ఒక్కకీచక మహారాజేకాదు. అతనిసోదరులు నూర్వురుకూడ మడసిరి.

వృ॥ కం—అయ్యో! ఎంతదురవస్థ. యశోలతికా! ఉపకీచకులనెవ్వరుచంపిరి.

యశో—గంధర్వులు.

వృ॥ కం—అట్లైన సుధేష్ణాదేవి దుఃఖమనివార్యమైనదే. అయ్యయో! ఉపకీచకులారా! మీలోనొకరైనజీవించియుండరైరికదా? ప్రశాంతమైనదే యశోలతికా మహారాజుగారిని దీసికొనివచ్చుటకై వెళ్ళుచుంటివా?

యశో—ఔను.

వృ-కం—సైరంధ్రినిచటనుండి వెడలిపొమ్మని చెప్పుమనరనుకొందురు

యశో—ఎందుచేత

వృ-కం—ఆమెను చూచినంతమాత్రమున గంధర్వులు సంహరించు చుండుటచేత.

యశో—అదె సైరంధ్రి యిటులనే వచ్చుచున్నది.

వృ-కం—(వడకుచు) ఇటులనే వచ్చుచున్నదా?

యశో—ఔను. యిటులనే.

వృ-కం—(భయముతో) ఇచట నిలువరాదు (అని నిష్క్రమించును)

యశో—నేనును ఘాకవిమీద వెళ్ళెదను (నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

---

రంగము—సుధేష్ణయంతఃపురము.

[విరటుఁడును సుధేష్ణ ప్రవేశింతురు.]

విర—తరుణీ! ఎందులకు విచారించెదవు? మనవస్తుపుమంచిదైనదా?

సుధే—అయ్యయో! సోదరులారా!

ఉ. నూర్వురు సోదరుల్మడిసి । సుద్గయిపోతిరె నాకునేల యీ
సర్వసుఖంబులు న్విభవ । సంపదలుండలపోయె నక్కటా!
యుర్వర నొక్కఁడైన మరి । యుండడదేమి పురాకృతంబుగం
ధర్వులచేతనుంబడిన । దక్కరెదోషము చాలఁ జేసిరే.

సైరంధ్రీ! ఎంతపనిచేసితివే?

విర—తనబుగారము మంచిదికానప్పుడు స్వర్ణకారుని దూషింపనేల? కాంతా! కడచినదానికై విచారింపరాదు. కానినీతోనొకసంగ తిచెప్పెదను. ఏమన సైరంధ్రిరూపవంతురాలు. ఎవఁడైనకర్మముచాలక చూచిన నాగంధర్వులు వానిని దుదముట్టింతురు. కావున సైరంధ్రిదెననెప్పుడు భయము బుగదుగుచుంట మననగరు నుండి తొలగించుటమంచిది. కాన ప్రార్థనాబూర్వకంబుగ నిచటనుండి పంపివేయుము.

సుధే—నాకంటఁబడిన సోదరమరణవిచారము కొట్టించుచుండుటను. మీసేవ పరిహారము చెప్పెదను.

విర—అదుగో సైరంధ్రి. నేనిటనుండరాను. (అనినిష్క్రమించును.)

సుధే—అయ్యో! తమ్ముడా! సింహబలా! ఇఁకెక్కడిసింహబలుఁడు? వాడు నేనొనర్చిన యుపదేశము చెవులకెక్కినదికాదు. నేనె చేతులార నిన్నుజంపుకొంటిని. నీమూఢమదమూఢిమోహమాటల కీమె హరుచెప్పనైతిని ఇంతకును దైవఘటన మిట్లున్నది.

[సైరంధ్రి ప్రవేశించుచున్నది.)

ద్రౌప—(తనలో) నన్నన్యాయంబుఁగ బాధించిన కీచకోపకీచకుల గంధర్వ నెపంబున మన్నాథుఁడు మట్టుబెట్టి వారు ముదంబు గూర్చెను. తానిందుఁబ్రవేశించు కతంబున సుధేష్ణాదేవి మిక్కిలి వగచుచున్నది. (ప్రకా) అమ్మా! గతించినదానికి వగవనేల? మనము మాత్రము స్థిరంబుగనుండువారమా?

సుధే—(విచారముతో) అయ్యో! సోదరా! మీపాలి కీమృత్యువెక్కడ నుండి వచ్చినదో కదా? అమ్మా! సైరంధ్రీ! నీవు మిక్కిలి సౌకర్యవంతురాలవు. నిన్నుజూచి యెవండేవి భ్రమపడిన వానిని గంధర్వులుసంహరింతురు. నానాథుఁడునకు పూరుషుఁడు మగ వారలేకదా! నిన్నుఁ గాంచినంత వారికి భయ బు గదురు చున్నది. 'కావున నిచటనుండి మఱియొక చోటికి జనుమని వినయపూర్వకముగ మన్నాథుండు కోరుచున్నాఁడు.

ద్రౌప—(తనలో) ఈమె సోదరమరణవిచారవిహ్వలహృదయుఁబున నిట్లు పలుకుచున్నది. ఇఁక మాయజ్ఞాతవాస మితిదినంబులు పండ్రెండు మాత్రమేయున్నవి. కావున నీమితిదినంబులుం కూడ నిచటనేయుండ వేఁడుకొందును. (ప్రకా) అమ్మా! నావిభులగు గంధర్వులు మీయందు జాల దయాంతరంగులై యున్నారు

పండ్రెండు దివసంబులు మాత్రము నీయింట వసింపనిమ్ము. వారు మీకు మేలొనర్చి నన్ను తమతోడ దీసికొనివెళ్ళుదురు.

సుధే—అమ్మా! నీయిష్టమువచ్చినట్లుండుము. నీవు నాకు బరిచర్య చేయవలదు. నాభర్తను కుమారులను రక్షించుభారమునీదియె

ద్రౌప—(తనలో) ఈమె భయమేమనవచ్చును (ప్రకా) అమ్మా! సేవకురాలగు నన్నింతగ బొగడరాదు.

[అంత నొకచేటి ప్రవేశించుచున్నది.]

చేటి—దేవీ! హస్తినాపురమునుండి యొకమల్లుఁడువచ్చెనట. వానితో బోరునలుపు వినోదముగాంచుటకై రమ్మనమని మహారాజాగా రానతిచ్చిరి.

సుధే—అట్లయిన మన మేగుదము రండు.

ద్రౌప—మంచిది. (తెరవ్రాలును.)

---

## 2 వ రంగము—విరటసభ.

---

[ప్రవేశము—విరటుఁడు, కంకుభట్టు, మల్లుఁడు పరివారము.]

మల్లు—రాజా! మల్లు డోడిపోయెను ఇఁక నెవరైనఁగలరా! లేకున్న లేరని చెప్పుఁడు.

విర—(విచారముతో) మహాత్మా! కంకుభట్టా? మనమేమిచేయవచ్చును? మనచేఁ బంపబడినమల్లుఁ డోడెఁ నికెవ్వరుకన్పింపరు. సింహబలుఁడున్న మన కీభంగపాటు రాదు.

కంకు—మహారాజా! ఇంతకైయింత యోజింపనేల? మనవలలుని రప్పింపుము ఆతఁడీ మల్లుని జయింపఁ గలఁడు.

విర—(పరిచారకునితో) ఓరీ! మనవలలుని బిలుచుకొనిరమ్ము.

మల్లు—రాజా! ఏమిచెప్పెదరు. నన్ను మల్లయుద్ధంబున జయింపఁ గలవాఁ డెక్కడనులేఁడు. అనేక దేశాధీశుల సభాస్థలంబుల గాంచితిని. ఎవ్వరు నన్నెదుర్కొన్న వారేలేరు. యింకనీవు పిలిపింపఁ బోవు మల్లుఁడు మాత్రము నన్ను జయింపఁగలఁడా?

(వలలుఁడు ప్రవేశించును)

వల—విరటమహీపాలా! నన్నెందులకుఁ బిలిపించితిరి?

విర—వలలా! ఈతఁడొక జట్టి సకలరాజన్య సభాంతరంబులగల మల్లురతోఁ బోరి జయముగాంచినాడట మనసభలో నెవరైన గలరేమో యని వచ్చినాడట కావున నీవతనితోఁ బోరి విజయము గాంచి మనదర్బారునకు ఖ్యాతిని దెమ్ము.

వల—(ధర్మజుని దెసఁగాంచును.)

కంకు—వలలా! నీవు మల్లయుద్ధంబునఁ గడు ప్రావీణ్యుడవని చెప్పి నందులకు మాటదక్కింపుము.

వల—దేవా! భవదీయకరుణావిశేషంబున నీతనితోఁ గయ్యమొనరించి జయముగాంచుట యొకలెక్కలోనిది కాదు. నాకనుజ్ఞనీయుడు.

విర—పోరాడి జయము గొనుము,

వల—(నమస్కరించి లేచి) మల్లుఁడా!

మ. ధరణీనాథ సభాంతరంబుల మహా । ధైర్యంబు రెట్టింప మే
ల్బిరుదంబుల్ గొనినాడవంట యిపుడే । వీరవ్యమొప్పార సం
గర పాండిత్యముఁజూపుమా వలలుతో । గాంక్షించి పోరాడగా
దరమే నీకు భయంబులేక నిలుమా । దారుఢ్య దేహుండవై

మల్లు—వలలుఁడా!

ఉ. భూపసభాస్థలింబోలుచు । బూర్ణబలాఢ్యుల శూరవీరులం
దేపకదేపకుంగనుచు । దేజము దూల్చితి మల్లయుద్ధమం
దాపదనొంది కుంది సమ । రావని నావిజయంబు చెప్పఁచుం
భూపునిచేత మన్ననల । బొందుగ వాకొనరించి రెంతయుం.

వల—(వెడనవ్వునవ్వి) అట్లయిన మా భూపాలునిచే నీకు మన్ననల బెక్కులు సేయించెదనులే. ఏదీ! చూతము నీబింకము.

(అని మరలఁ జరచును.)

మల్లు—రారమ్ము. (ఇరువురు కొంతతడవు పోరాడుదురు.)

వల—(మల్లుని క్రిందబడద్రోసి వానిపైఁ గూర్చుండి) మల్లుడా యిపు డేమనియెదవు.

మల్లు—అయ్యో! ఎముకలు చూర్ణమ్ములగుచున్నవి. ఎంతటి బలవంతులయిన నాకడ నిలువలేకపోయిరి. నేను నీకోడిపోతిని. రక్షింపుము. రక్షింపుము.

వల—జయ మెవరిది!

మల్లు—నీదే. నేనోడిపోతిని.

విర—వలలా! ఈతని వదలివేయుము.

(వలలుఁడు మల్లుని వదలివేయును.)

మల్లు—(విరటునిగాంచి) దేవా! అనేక జగజెట్టులగాంచి వారితోఁ బోరితిని గాని సులువుగ నన్ను జయించినవారి నెందును గానలేదు. ఈతనివలన మీసంస్థానమర్యాద నిలిచినది. నాకనుజ్ఞ యిప్పింపుఁడు.

విర—మంచిది.

మల్లు—(సభాస్థలము దాటివచ్చి) ఏమిది వింతగనున్నదే! ఈబలశాలి భీముఁడై యుండునా. లేకున్న నింతచులుకనగ నోడింపఁజాలడు తప్పక పాండవులిందేకలరు. ఏమన నొక స్త్రీవిషయమై సింహాబలుడంతటి బలవరాక్రమవంతుఁడు మరణించుట చూడ నాశ్చర్యమగుచున్నది. లోకంబున బలవంతు లార్వురితో దుర్యోధనుండును బలరాముండును భీముడు సింహబలుండును శిశుపాలుండు నన్నోర్వ్ని సమానబలవంతులు. కల్ల దుర్యోధన బలరాముల

దగ్గరఁగలేరు. పాండవులజ్ఞాతంబు సలుపుచున్నారు. వారిచటనే యుండితీరుదురు. యీసంగతి మాదుర్యోధన మహారాజుతో దెల్పెదనుగాక. (అని నిష్క్రమించును.)

విర—వలలా! మనదర్బారునకుఁ గీర్తిఁ దెచ్చిన నిన్నెంతగీర్తించినను దీరదు. ఈముక్తాహారంబు గైకొమ్ము. (అని తన మెడలోని ముత్యాలపేరిచ్చును.)

వల—మహారాజా! వలలవానికి హారముతోఁ బనేమి? వంటసేయువేళ యైనది. నాకనుజ్ఞయిండు.

విర—మంచిది. (వలలుండు నిష్క్రమించును)

(ఒక గోపాలుఁడు ప్రవేశించి)

గోపా—దేవా! రక్షింపుము. రక్షింపుము.

విర—ఏమిరా! రోజుచుంటివి. కారణమేమి?

గోపా—త్రిగర్త దేశాధీశుఁడగు సుశర్మ చతురంగ బలసమేతుండై వచ్చి దక్షిణదిశయందుండు దేవరవారి గోవులఁబట్టుకొని పోవుచున్నాఁడు. దేవర వెంటనే బయలుదేరి సుశర్మ నెదిరించి గోవుల మరల్పనిచో మోసము వాటిల్లును.

విర—(కోపముతో)

శా. ఔరౌరా! కనువింతఁగానకను గ ర్వాంధుండునై దుష్టుఁడై
ధీరత్వంబున గోవులంబొదిలెనే తేజంబు పెంపొందఁగా
ఘోరాజిం బ్రతదేవుఁగానమవనే కోల్పోవడే ధీరతం
సారం బెక్కడనుండి వచ్చెమన గో సంఘంబునుం బట్టఁగన్.

ఔరా! కాలమహిమ ఇదివరకు నాచేనోడింపఁబడి కాందిశీకుఁడై మరల విజృంభింప గారణమేమియో ఓరీ! శంఖశతానికారులతో నీసంగతిజెప్పి యుద్ధోన్ముఖులై రమ్మనుము. సారథితో రథము నాయితము సేయుమనుము. (కంకుభట్టుతో) స్వామీ! ఈ ఘోరమన్యుఁ డిదివరకు పెక్కుకదనంబుల గలాయసము ఒత్త

గించినవాడే. సింహబలుఁడు మరణించినవార్త విని గర్వించి గోవులఁబట్టియుండనోపు. ఎక్కడికి బోగలఁడు లెండి వైరులతో సంగరమొనరింపఁబోవు నన్నాశీర్వదింపుఁడు. (నమస్కరించును

కంకు—రాజా! జయము గొనుము. (తనలో) నేటితో మాయజ్ఞాతవాస మితి దాటగలదు. ఈవిరటుని నీడనుండి మాప్రతిజ్ఞఁ దీర్చికొంటిమి. రాజునకు సమయము దటస్థించినది. కావున మేము నలువురము నీతోఁ కిఁ దోడుగాఁబోయి యుద్ధమొనర్చుట మంచిది. (ప్రకా) రాజా! నీవు వైరివీరులతో సంగరం బొనరింప నేగుచుంటివి నీతోఁగూడ నేనుకూడవచ్చి కొంత యాహవక్రీడ నొనరింప నుత్సుకము గలుగుచున్నది. నాకు విలువిద్యయందు గొంత పాండితిగలదు. కాన నాకోర్కె యంగీకరింపుము.

విర—స్వామీ! ఇంతకన్న మాకేమి కావలయును. ఓరీ! కంకుభట్టుగారికి రథం బాయత్తంబుసేసి తెమ్మని నాయానతిగాఁ జెప్పుము. పొమ్ము.

గోపా—చిత్తము దేవా!

కంకు—మహారాజా! మనతోఁగూడ వలలుని దామగ్రంథి, తంత్రీపాలుర గొనిపోయినలెస్స. వారుకూడ గొంత సంగరపాండిత్యముల బరచుకొనియుండిరి. నేనప్పుడప్పుడు వారి సుశిక్షితత్వము కన్నులారఁగాంచియుంటిని.

విర—అట్లయిన మరియు మంచిదె. తప్పక యటులనే కొనిపోవుదము మఱిమూడు రథంబుల నాయిత్తంబుసేసి వలల దామగ్రంథి తంత్రీపాలురకుగూడ రప్పింపుమని చెప్పుము పొమ్ము. స్వామీ! తాము సంసిద్ధులైరండు.

(అందరు నిష్క్రమింతురు.)



శ్రీశారదాంబాయై నమః

# పాండవాజ్ఞాతవాసము

## పంచమాంకము

రంగము—రాజవీధి.

[కేశవశర్మ ప్రవేశించును.]

కేశ—ఆహా! ఏమి యదృష్టమో కాని నాకుమారునికి వివాహము తలపెట్టిన యప్పటినుండియుఁ గంటికి నిద్రయుఁ గడుపునిండుగ నాహారము లేదు సరికదా? రామ రామ! ఇంటిపట్టుననుండి సుఖముగనైనఁ గూర్చుండుట లేదు. విధరాధీశుని గాంచినను సమయము కాదనువారే. ఇంతకును వానికి కల్యాణము రాలేదు కాబోలు. "అన్యథా చింతితం కార్యం దైవమన్యత్ర చింతయేత్" ను నార్యోక్తి నాయందు వరించినది. ఈమత్స్యదేశాధీశుండగు విరటమహీజాని తన శ్యాలకుల దినవార క్రియలయందు గొప్ప గన్యాదాన, భూదాన, గృహదాన, హిరణ్య గోదానములు చేయించినాడట. అప్పట్లో జ్యేష్ఠాదేవి నెత్తిపైఁ దాండవమాడుచున్నది. ఈనగర ప్రాంతముననే యుంటిని. ఏమి లాభము? అదిగో ఎవరో వచ్చుచున్నారు.

[నారాయణుండు ప్రవేశించును]

కేశ—ఎవరు నాయనా మీరు.

నారా—నేను నారాయణుండను.

కేశ—నా పాలిటికి నీవు నారాయణుఁడవే. నారాయణా మాట.

నారా—ఏమిపని?

కేశ—మా నర్సిగానికి వివాహంచేయతలంపులో వచ్చితిని. రాజుగారి దర్శనమగునా?

నారా—తప్పకుండ గాఁగలదు. కాని

కేశ—ఏమి బాబూ "కాని" అనుచున్నావు. ఏమయిన మా పెద్దమ్మ యిక్కడకు వచ్చినదా?

నారా—ప్రస్తుతము నగరులో లేదు.

కేశ—(కూలఁబడి) అయ్యో! ఎంతవస్తరా బాబూ! (అనివగర్చును.)

నారా—ఎందుకుండి యింత తాపత్రియపడెదరు?

కేశ—నాయనా! ఏమిచెప్పవచ్చును. నాకు లేకలేక యొకమగచిన్నవాఁడు కలిగినాడు వానికి శ్రౌతస్మార్తములు కావ్యనాటకాలంకారములు చెప్పించితిని. ఇప్పుడు వ్యాకరణశాస్త్రముచదువుచున్నాడు. వానికి వివాహము తలపెట్టి రెండుసంవత్సరములైనది. ఇప్పటికి దెచ్చినద్రవ్యము బత్యములక్రింద సరిపోవుచున్నది కాని యేమియు మిగులుటలేదు. నేనుకూడ యింత చదువుకొనినవాడనే. నాయనా! రాజుగారెక్కడకు వెళ్ళినారు

నారా—త్రిగర్త దేశాధిపతియగు సుశర్మవచ్చి దక్షిణదిశయందలి గోవులను బట్టుకొనుటచే వానితోఁ యుద్ధమొనర్చి గోవులమరలించుటకై సమస్త చతురంగ బలసమేతముగా బయలుదేరి నిన్ననే వెళ్ళిరి. నేనా సంగరరంగంబునుండియే వచ్చుచుంటిని.

కేశ—అయ్యో! అక్కడ విశేషములు సవిస్తరంబుగఁ దెలుపుము.

నారా—ఇచటనుండి యతిత్వరిత గమనంబున సుశర్మసైన్యంబులగూడ ముట్టిశంఖభేరినిస్సాణాది రవంబులు మిన్నుముట్టమహాసముద్రంబులొండొంటిందాకు చందంబున భయంకరాట్టహాస భీషణంబుగ సేనలొండొంటిందాకి సంగరంబొనర్పసాగినది. రథాశ్వంబుల రేగి

సకలంధూళిచే నిరువాగుల వారును శరభేదన విచారశూన్యులై
తమవారనే పొడుచుకొనఁ జొచ్చిరి.

కేశ—ఆహా! వీరందఱికి వీరస్వర్గము. ఎంతటిపుణ్యాత్ములు. తరువాత

నారా—తరువాతఁ గోధిగాత్రి నిర్ముక్తరక్తపాతంబున నాధూళియడం
గిన తేజస్వులై వైరివీరుల దునుమాడి వీరాటోపంబున శ్రుత
శతానీకాదులు వీరవిహారంబు సలుపుచుండిరి.

కేశ—ఉత్తమక్షత్రియులు యుద్ధమన్న మిక్కిలి మక్కువఁ జేతురు. పిదప

నారా—పిదప. తనసైన్యంబు లోటువడుటగాంచి సుశర్మ సేనలకుఁ
జేయి వీచి తానుప్రచండ మార్తాండుని విధంబున శరజాలం
బుల బరంగించుచు సేనాసాగరంబునింకఁ దొడంగినఁ గాంచి
మత్స్యేశుండును గోసాయల్లి తీక్షణుండై సునిశితశరంబుల వైరి
శిరంబుల కదనభూమిని డొల్లసేయుచు బ్రతిఘటించిన నిరువు
రకు పోరుఘోరంబయ్యె. అత్తరి సైనికశిరోవేష్టంబులు పుండరీ
కంబులచందంబునను కేశపాశంబులు శైవాలంబుల వడుపునను,
బాహువులు మృణాలంబుల భంగిని, ఖాద్రింబులుమహామీనం
బుల తెఱంగునను సైనికగాత్రి నిర్ముక్తరక్తంబు నీరంబుభాతిని
కదనరంగంబు సరోవరంబుననుకరించె. అంతట సుశర్మ విజృం
భించి విరటుని రథ్యంబుల గూల్చి సారథిని దునుమాడి దర్పించి
కుప్పించి విరటుని రథంబుమీఁదికిఁ కి మహోగ్రభుని బంధించి తన
రథంబుపైఁ బెట్టుకొని మాదేశవారలాహాకారంబు నొనరింపఁ
దన దేశ సింహనాదంబులు రోదసీకుహరంబుల పిక్కటిల్లఁ
గొనిపోవుచుండెను.

కేశ—అయ్యయో! ఎంతదారుణము. పిమ్మట.

నారా—పిమ్మట త్రిగర్తులపాలె మువ్వురు రథికవరులు కంఠరయం
బునవచ్చి భయ దాట్టహాసభీషణంబుగ సుశర్మపై శరాసారం

బుగురియించుచు రథరథ్యసారథిసహితంబుగ నుగ్గుజేసి విరటుని విడిపించి సుశర్మనారాజు రజ్జువులతోడనే బంధించిరి.

కేశ—(హర్షముతో) బాగుబాగు రథికవరులారా! మిమ్ముల నెంతగఁ బొగడిన తీరదు. పదపడి.

నారా—పదపడి సుశర్మని పుత్రమిత్రామాత్యసహితంబుగ ధర్మప్రభువులగు మామహారాజుగారు విడిచిపుచ్చి తమజయంబు పురంబునఁజాట నాజ్ఞయిచుటచే నేను చనుదెంచితిని.

కేశ—(సంతోషముతో)మంచియదృష్టవంతుఁడనే. ఈసంతోషసమయమున నాకోర్కె నెరవేరఁగలదు.

[గోరక్షణాధికారి మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

నారా—మాధవా! ఏమి తొందరగ వచ్చుచున్నావు?

మాధ—ఏమి చెప్పవచ్చును? ఉత్తరదిశయందలి గోవులను కౌరవులు పట్టుకొని వెళ్ళుచున్నారు. రాజుగారితో మనవిచేయుటకై వచ్చుచుంటిని.

కేశ—ఏమి నాయదృష్టము. ఈయలజడిలోనాసంగతి యాలోచింతురా? నాయనా! నేనెక్కడికి వెళ్ళినను ముందుగ దౌర్భాగ్యము నడచుచున్నది. నేవెడలెదను. (నిష్క్రమించును.)

నారా—అట్లయిన రాజుగారికుమారుఁడు ఉత్తరునితో నీసంగతి వచింపుము రాజుగారు సుశర్మాదుల జయించుటకై చనిరి. నేను చనెదను. (నిష్క్రమించును.)

మాధ—త్వరగ మనవిచేయకున్న మోసము రాఁగలదు.

(అని నిష్క్రమించును.

ఇది విష్కంభము.



67 రంగము—రాజనగరు.

---

ప్రవేశము—ఉత్తరుఁడు, మాధవుఁడు, సైరంధ్రి.

ఉ—మాధవా! ఏమిజరిగినది?

మాధ—భీష్మ ద్రోణ కృపాశ్వత్థామకర్ణాది వీరాధివీరులతో దుర్యోధనుఁడు మనగోవులఁబట్టుకొనెను. మేమెదిరించిన శరజాలంబుల మమ్ముగాందిశీకులజేసె. కావున యీసంగతి మనవిచేయుటకై వచ్చితిని.

ఉ—(కోపముతో) ఏమేమీ కౌరవులగర్వము దుర్వారబాహుబల సంపన్నుఁడనగు నాచే రూపుమడి సాహసాక్రాంతులుకారా? ఈలి డర్జునుండనునట్లు సమరంబొనర్చి గోవుల మరలించెదను. ఓరీ దుర్యోధనా?

శా. ఆలంబట్టితినంచు నెంచితివి మదిలో । నత్యంతగర్వంబు నీ
కేలాకల్గెను బింకమార్పగను మ । త్స్యేశాత్మజుం డిప్పుడే
లీలం గోవులవత్సలస్మరలన । క్లేశంబునకస్థానమౌల్
వైళంబొప్పఁగఁజేర్పవచ్చునిదె దు । ర్వారప్రతాపోన్నతిన్.

(ఇంచుక యోచించి)

గీ. తగినసారథిలేము ర । థంబునడుప
నెట్లుజనువాఁడ పశువు । ల నెట్లుమరల
జేయువాఁడ విచారంబు । చిత్తమందు
బుట్టెగోపాల! మాధవా! । నిట్టలముగ.

సైరం—కుమారా! సారథికై యింత యోజింపనేల? మనబృహన్నల రథసారథ్యంబున గడునేర్పరి.

ఉ—(పెడనవ్వునవ్వి) సైరంధ్రి! పేడియగు బృహన్నలను నేను కన్నెత్తైన చూడనే.

గీ. కయ్యమున్గలిగె । కౌరవులకుమా కు
పేడివానిగొంచు । వేగజనిన
నవ్వరో కొ్కమిగుల । జివ్వకుసారథి
దగిన వానిగాన । దగదెయమునుచు.

సైరం—కుమారా! బృహన్నలలావు నీవెఱుంగవు.

ఉ. కౌరవసేనగాదు త్రిజ । గంబులు నొక్కటనేకమైన నా
తేరు బృహన్నలే నడుప । దీరుగ కయ్యముగెల్పుతోడ న
వ్వీరవరేణ్యుఁ డాకృతిని । వింతఁగఁదోచిన నంతశౌర్యమున్
బారముదప్పనే విరస । భావము జూపుటమేలె యుత్తరా!

ఉ—మాలినీ! కన్యకాజనమధ్యంబున నృత్తగీతాదికంబుల నేర్పుచుండు బృహన్నల నంగర రంగంబున నిర్భీతుండై శత్రువీరవిశాయంబుల పరంపరల కూల్చునప్పుడు స్యందనంబు విచిత్రగతులనడుపంజాలునా? మఱియు శంఖ నిస్సాణభేరీరవంబునకు గలంగక గజఘీంకారంబులకుఁ జలింపక హయహేషితంబుల కులికిపడక, సింహనాదంబులకు భీతిల్లక సైనికాట్టహాసంబులకు బెగడువడక రథికుని మతానుసారంబుగ రథచోదకపాండితి బృహన్నలకు గలదా?

సైరం—కుమారా! ఆవిషయమై నీవెంతయు సంశయంబొందకుము.

ఉ. ఖాండవమేర్చునప్పుడు మ । గంటిమిమీరగఁసూతకృత్య మా
ఖాండల సూతికిన్నడిపి । కాంచగజేసె జయంబుమున్నా నీ
కాండొకచింతమాని రథ । మూర్జితరీతినడోల నాతఁడు
ఖండన భూమిజేరరిపు । భంజన ! వేఱొసిపోమ్మసూతుగా!
అనేక సమరంబుల బార్థున కాతడె సూతకృత్యమాచరించెను.

ఉ—అట్లయిన నాతని బిలపింపుము.

సైరం—నేవెళ్ళియాతని దీసికొని వచ్చెదను. (అని నిష్క్రమించి బృహన్నల ఉత్తర సహితంబుగఁ బ్రవేశించును.)

ఉత్త—బృహన్నలా! కౌరవులతో గయ్యంబు నేఁడు నాకు గలిగినది. కావున రథంబాయితంబుచేసి నొగలెక్కుము. ఈతనుత్రాణంబు ధరింపుము.

బృహ—ఉత్తరా! నాట్యమందు నాకుబ్రజ్ఞకలదుగాని రథసారథ్యమందు కలదా?

ఉత్త—బృహన్నలా! నీసామర్థ్యంబింతకుమున్న సైరంధ్రినాతో వచించినది. పార్థునకు సారథివై పెక్కుకదనంబుల జయంబు గాంచితివట. ఇఁక మరుమాటాడకుము. కవచంబు దొడిగికొనుము.

బృహ—(వింతఁగఁజూచుచు కప్పుకొనును.) అందఱు నవ్వెదరు.

ఉత్త—(తనలో) వీనికి రథచోదక సామర్థ్యంబు కలదా? (ప్రకా) బాగు బాగు! (అని తొడుగును) నొగలెక్కుదము రమ్ము.

ఉత్త—బృహన్నలా! కౌరవులు మంచి మంచి శిరోవేష్టనంబులు ధరించి వచ్చియుందురు. మాబొమ్మపాత్రికలకు వారితలపాగ పోఁగులదెండు.

బృహ—మంచిది. (అందరు నిష్క్రమింతురు.)

రంగము—విరటనగరప్రాంతమునందలి బయలు.

ఉత్తరుఁడు బృహన్నల రథస్థులై ప్రవేశింతురు

ఉత్త—బృహన్నలా!

మ. కురువీరుల్ నను దాకి సంగరమునం। గొంకేమియున్లేక స
త్వరులై పోరెడువేళ ధైర్యము నను। త్సాహంబు రెట్టింపగా
స్థిరతం దోలుము తేరు భీతిఁగొనఁగా। శ్రేయంబు వాటిల్లునే
ధరణీనాథుని మన్ననంగొనుము ప్ర। స్తావింతు నింకేటికిన్.

బృహ—రాజనందనా! నాకు ధైర్యంబుగరపుచుంటివి మేలు. భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణ శకుని దుశ్శాసన దుర్యోధనాది రథిక మహారథిక యతిరథ శ్రేష్ఠులలో బవరంబొనరించిచలింపక

నిలువుము. సూతకృత్యమ్మెల్లా నిర్వర్తించెదను. అల్లదె కౌరవ సేన. ఉత్తరా! గాంచితివే.

ఉ. శాంతనవుండు ద్రోణుఁడును । సంగర దుర్జయుడైన కర్ణునున్
బంతము మీఱ ద్రౌణియును । బాసటయై తనుగొల్వధీరులై
ప్రాంతమునందు గొంకక ర । నన్నతసైన్యముతోడ నేగు సా
మంతులఁ గాంచితే నృపకు । మార! రణోత్సవమింపుగొల్పఁగన్.

ఉత్త—(మూఁడి భయముతో)

మ. ఇదియా కౌరవసేన కాంచఁగను న । న్నంతేని భీతాత్మునిం
బొదలం జేసెను దీనిగెల్వఁగలనా । మానంబు వాటిల్లెడున్
మదిలోనం దలపోయఁ గేనిటుల దు । ర్మానంబున న్వచ్చితిన్
గదనంబిప్పుడు సేయఁజాల రణకాం । క్షన్వీడుమా సారథీ.

ఆ. వె. పురము జేర్పుమింక । భూషణాంబరముల
నిచ్చువాఁడ బిరుదు । లిచ్చువాఁడ
రణముఁ దేపుఁ డెఱుఁగ । త్రాణయు లేదింత
బాల్యచాపలత్వ । ఘటిమఁ జేసితి.

బృహ—శౌర్యవంతుఁడా! మత్స్యమహీవరాత్మజా! ఈరీతి విభ్రాంతి జెందుట ధైర్యవంతుని లక్షణమే?

ఆ. వె. అరులఁదోలి యాల । నరలి తు నేనంచు
నింటయొద్ద బలికి । యిపుడు భీతి
జెంది పురము జేర । క్రిందుగఁ బౌరులు
పొరుఁబోతటంచు । బరిహసింత్రు.

ఉత్త—పురజనులు హసించిన హసింతురు సమ్మా. నేను మాత్రమీ కురు సైన్యంబుదాకి యుద్ధమొనరించువాఁడను గాను. ఎవరెట్లు పోయిన పోనిమ్మా.

ఉ. బాలుఁడ సంగరోర్వి విలు । పట్టుట యించుక నేర్వనట్టి సం
శీలుఁడ వైరులన్న బర । శక్తిహరైకవిలాసులందులో

కేలను జేసినస్వేడు వ । భీకితదేహుఁడనౌచు నచ్చటం
గాలునిపొంతకేగగను । గాలమువచ్చెవెసన్ బృహన్నలా.

కావున రథంబుమరలింపు పురంబుజేర్పుము. నాప్రాణంబుల గాపాడుము. ఎవరిప్రాణమువారికి తీపియనుమాటనీవెరుగవా?

బృహ—కుమారా! భీతిల్లకుము. క్షత్రియునకు యుద్ధంబున వైరుల వధించుటయో తానుజచ్చుటయో యాచారమైయున్నది. నీ వుత్తమక్షత్రియుఁడవు. ఇట్లుపిరికితనము వహింపరాదు. ఈ స్వల్పసైన్యముగాంచినంతనే భయపడుచుంటివా?

ఉ—బృహన్నలా! రణాంబనంగ నేమనుకొంటివి? సంగీతనృత్యలాస్యా భినయంబులుకావు. వ్రిధమంబున సారథినేచంపుదురు నిన్ను నిష్కారణంబుగ రిపులపాలుజేయ నామనంబిచ్ఛగింపకున్నది.

బృ—ఉత్తరా! రాజాత్మజా! నన్నుగూర్చి నీవించుకయు విచారింప కుము. రథికుని నేర్పుచాలకుండిన సారథిని జంపుదురు. మూఁడు లోకంబు లొక్కట బాసటయైవచ్చిన నేభయపడువాఁడనుకాను.

ఉత్త—(తనలో) ఈతఁడు నిశ్శంక కౌరవసేనందాక నేగుచున్నవాఁడు నాకాళ్ళుతడబడుచున్నవి. గొంతుకగ్గదికపడుచున్నది. అయ్యో! తలిదండ్రులారా! మిమ్మింక చూచు భాగ్యము నాకు లేదు. (ప్రకా) సూతుఁడా! బృహన్నలా! నన్ను బోనిమ్ము. నీకండకొవ్వు కరుగకయున్న నీవేగి కౌరవులఁదాకుము. (అని పడకును)

బృహ—(నవ్వుచు) రాజనందనా! నీవు మొదట నన్ను బిలిచిసూతకృత్యమునకు నియమించునపు డాడినమాటలు స్మరించుకొనుము. ఆడువారల దగ్గఱ ప్రగల్భములుపలికి యింటికి రిత్తచేతులతో బోయిన మనయుత్తరాదు లేమందురు. గోవుల మరలించుట యెంతయో కనికాదు.

ఉ—ఎవరేమనిన నాకులక్ష్యము లేదు. అనిరథముదిగి పరుగెత్తి పోవును

బృ—(రథముదిగి ఉత్తరుని నవ్వుచు బట్టుకొనును.)

ఉ—(గిలగిలకొట్టుకొనుచు దీనతతో) బృహన్నలా! నీకు నమస్కరించెదను. తలిదండ్రులకేకపుత్రుడను. రణమధ్యంబున బంచత్వంబునొందిన నాకై మిగులశోకింతురు.

బృ—ఉత్తరా! నీకాభయమక్కరలేదు. నీవుసారథివై రథంబునడుపుము. నేరథికుడనై గోవులమరలింతును. (అని ఉత్తరుని నొగులపైఁగూర్చుండబెట్టును.)

ఉ—(భయముతో) బృహన్నలా! నాపై నీకింతకనికరములేదేమి? నాపాణంబుల దీయనెంచుటకు నీకేమియపరాధముచేసితి? సుఖంబుగ నిల్లు చేరనిమ్ము. నిన్ను సదాస్మరించెదను. నీమేలు మరువను. నన్నుకరుణింపుము.

బృ—(నవ్వుచు) ఉత్తరకుమారా! ఇంత పిరికిదన మెక్కడనుండి వచ్చినదోయి! తేరుపోవనిమ్ము.

ఉత్త—(గమనవేగంబు నిరూపించుచు) మన మెచటికి బోవలెను.

బృహ—ఆపితృవనంబునఁగనఁబడు శమీవృక్షంబుపొంతకుఁబోనిమ్ము (తనలో) మాయజ్ఞాతవాసదీక్ష నిన్నటితోఁ బూర్తియైనది. ఉత్తరునితో మాయుదంతంబు దెల్పిన నిఁక భంగంబులేదు. (ప్రకా) ఉత్తరా! అచ్చట పాండవుల యాయుధములు కలవు.

ఉత్త—బృహన్నలా! పాండవులనంగ నాకు మిక్కిలిప్రేమ. వారు మాకు బాధుకోటిలోనివారు సుమా! ఇదె శమీవృక్షము సమీపించితిమి.

బృహ—ఈజమ్మిచెట్టుమీఁదకెక్కి యాయుధంబుల దీయుదము. నా చేతుల లావునకీ విరుతవిల్లు చాలదు.

ఉ—అయ్యో! ఇచట శవమును గట్టియుంచిరి. నేనుత్తమక్షత్రియుఁడను. నీకుఁగు సంటరాదు.

బృహ—కుమారా! ఇతరు లెవరు నంటకుండుటకై యిట్లు కట్టియుంచిరి. అందలి పెద్దకొండచిలువవలెనున్నది గాండీవ మను ధనసు నిటు దెమ్ము.

ఉత్త—(చెట్టుపై కెక్కి) బృహన్నలా! పాండవులు మిక్కిలి ధర్మాత్ములుసుమీ? ఇచట నాయుధంబులు దాచి వారెక్కడనున్నారో కదా? ఆహా! ద్రౌపదీదేవివంటి పతివ్రత యొండైనగలదా? ధర్మరాజన్న నాతనికతఁడేసాటి. భీముఁడు రణరంగభీముఁడే కదా. అర్జనుని మాటయిఁక చెప్ప నేల? ముల్లోకంబుల నొక్కగోల గూలనేయసమర్థుండు. కవలులసాహసం బెన్నదరమా? అట్టివారలెట్లు చిక్కులఁబడి యుండుచున్నారోకదా? కాలము దాటరానిది.

బృహ—ఉత్తరా! దాపనేల చెప్పెదవినుము.

సీ. సన్యాసి వేషియై । జనకుని సేవించు
నాకంకుభట్టు ధ । ర్మాత్మజుండు
బాహుబలోత్సాహి । వంటవృత్తి జరించు
వలలనామంబున । వాయుసుతుఁడు
తురఁగవిద్యాప్రౌఢి । ధరణీశుగొల్చు దా
మగ్రంధి పేరను । మాద్రికొడుకు
కదుపుల మేపుచు । గడువడి దిరుగు దం
త్రీపాలుఁడె సహ । దేవుఁడతఁడు

గీ. మాలినియనంగ మీతల్లి । నోలిగొల్చు
నా తమేసున్న ద్రుపద భూ । కాంతుపుత్రి
పాండవుల పత్నియైన ద్రౌ । పదిగుణాఢ్య
జానకీకీర్తి సీతఁజి(?) । పాలఁగంగు. ౧౮.

సీ. ఈశునోడించి ఖాండవ । మేర్చి కాల్చి
కాలకేయాదిదనుజులఁ । గలనఁజంపి
పట్టి పేరుఁడ నర్జునా । హ్వాయుఁడ నేను
పరఁగ గడిపితి మజ్ఞాత । వాసదీక్ష
నీదుజనకుని సేవించి । నిశ్చయముగ.

ఉత్త—(ఆశ్చర్యముతో) బృహన్నలా! పాండవులు మాకడ నేయున్నారా! అయ్యయో! వారికెట్టియపరాధము చేసితిమి? నీవర్జునుఁడ వేనా? నీకీపేడిరూప మెచ్చటినుండి వచ్చినది.

బృహ—ఇంద్రలోకంబున కేగినప్పుడు నన్నుఁజూచి యూర్వశి మోహించి వచ్చిన నేనిరాకరించితిని అప్పుడు నన్ను నపుంసకునిగ శపించినది. అక్కారణంబున నేనిట్లయితిని. ఇంద్రుఁ డజ్ఞాతవాసకాలంబున దానిననుభవించున ట్లానతిచ్చె.

ఉత్త—అర్జునా! నీకుపదినామంబులుకలవు. వానిని వివరింపుము.

అర్జు—ఇంకను నీకు నమ్మకము కలుగలేదా? ఆలింపుము. అర్జునుఁడు ఫల్గునుఁడు, పార్థుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, భీభత్సుఁడు, విజయుఁడు, జిష్ణుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడు నను పది నామంబులు కలవు. ధరణీశులగెల్చి వారిచే బహుధన సంచయంబుల గొనుటచే ధనంజయుఁడనైతిని. రణమధ్యంబున గాండీవంబు రెండు చేతుల ధరించుటచే సవ్యసాచినైతిని. సమరంబున సమర్థులైన నన్ను దాకనేరకుండుట జిష్ణుఁడనైతిని. సవరంబున నపజయంబనుమాట నెరుంగక విజయుఁడనైతిని. యుద్ధంబున వైరులకుభీభత్సంబుత్పాతించుటచే భీభత్సుండనైతిని. నా రథ్యంబులగుటచే శ్వేతవాహనుఁడనైతిని. ఇంద్రదత్తంబగు రత్నప్రభాశోభితంబగు గిరీటధారణంబున గిరీటినైతిని. నాతల్లికి పృథ

యను నామంబుండుకతమున నేపార్థుండనైతిని. ఉత్తరఫల్గునీ నక్షత్రమందుద్భవమందుట చేఫల్గుణుండనైతిని? అర్జునవర్ణుండనగుట చేనర్జునుండనైతిని. ఇదె నానిజస్వరూపము. (అసలర్జునుఁడగును)

ఉత్త—(చెట్టుదిగివచ్చి నమస్కరించి) మహానుభావా! తెలియకనిన్ను కొన్నియవమాన వాక్యములాడితిని. నన్ను క్షమింపుము.

అర్జు—కుమారా! త్వరపడుము. గాండీవంబు దేవదత్తంబునిమ్ము. మనము జాగుచేసిన ప్రయోజనములేదు. గోగణంబు మరలింపవలయును.

ఉత్త—అర్జునా! నాకు పెక్కుదినంబులనుండియు నర్జునునకు రథచోధకత్వంబు సేయునభిలాషముండెడిది. (అన గాండీవంబు దేవదత్తంబునిచ్చును.)

అర్జు—సారథ్యంబు మీరానడుపుము. (అని రథంబెక్కి దేవదత్తంబు పూరించుచున్నాఁడు.)

(నిరువురు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.





శారదాంబాయనమః.

# పాండవాజ్ఞాతవాసము

షష్ఠాంకము.

---

రంగము—విరటనగర సమీపప్రదేశము.

ప్రవేశము—దుర్యోధన, కర్ణ, భీష్మద్రోణ కృపాశ్వత్థామలు.

దుర్యో—ఈమత్స్య మహీశుపురంబున పాండవులున్నారని యూహించి విరటుని గోవులను బట్టితిమికదా? ఈవార్త గోపాలకులు చని రాజునకు జెప్పకుందురా? పసువులను విడిపించుకొనుటకై యింతవరకు నెవ్వరు రాకుండుటకు గతంబేమి?

ద్రోణు—కౌరవేశ్వరా! గోరక్షకులు చని రాజుతో నేలచెప్పకుందురు? గోవులను విడిపించుకొనుటకై యాతఁడు ప్రయత్నించుచునేయుండును.

దుర్యో—మనతో యుద్ధమొనర్చుట కాతనికి శక్తి లేకుండుటచే భీతిల్లి యాతఁ డూరకొనెనేమో?

ద్రోణు—అట్లెన్నటికిని జరుగదు. ఆతఁడుమాత్రము క్షత్రియవంశసంజాతుండు కాఁడా? రణంబు సేయఁజాలఁడా? యుద్ధమున జయాపజయంబులు మనుష్యాధీనంబులే? మనము గోవులను బట్టికొంటిమని యతఁడూరకొనునంతటి బేలయా?

దుర్యో—విరటుని నగరంబున సింహబలుఁ డొక యాఁడుదానినిమిత్తంబున గంధర్వులచే జంపఁబడియెననియు, నచట సుభిక్షంబుగ నుండెననియు దెలిసి పాండవులిటగలరని యోజించితిమి. తాతగారు సెలవిచ్చినట్లు ధర్మరాజుండుచోటు సుభిక్షమనియు నాసుందరి ద్రౌపది కాఁబోలుననియుఁదలంచితిమి కాని (అర్ధోక్తి)

(తెరలో శంఖధ్వని.)

(విని) ఆచార్యవర్యా! ఇప్పుడు వినవచ్చినశంఖారవంబేదియో శ్రవణ కుహరంబులు వ్రియ్యలు చేయుచున్నది.

ద్రోణు—సుయోధనా! ఇప్పుడు వినవచ్చిన శబ్దము బ్రహ్మాండ భాండము బ్రద్దలుసేయునట్లు గావింపఁబడినది. ఇమ్మహారవంబాలించుటచే గుండెలవిసి సైన్యం బెల్లమొగ్గినదో చూడుము. ఇదితప్పక యర్జునుని దేవదత్తరవంబై యుండఁబోలు. సందియము లేదు.

భీష్మ—కౌరవేశ్వరా! ఇదితప్పక యర్జునుని దేవదత్తరవంబె. ధనురాచార్యుని పలుకులు లెస్సైయున్నవి.

ద్రోణు—(రాజుతో) దుర్యోధనా!

ఉ. భండన విక్రముండు రిపు । భంజన వేడుక వచ్చుచుండె వే
దండపురాధి నాయక స । దామదిలోన జనించుక్రోధ యు
క్తుండయి మత్స్యనాయకుఁడు । తోడ్పడ వేడిన నార్థిబుద్ధియై
గాండివముక్త మార్గణని । కాయము దూల్పఁగాని రి
క్తుండయి పోఁడు పోవఁడిల । కుంజరముంగను సింగమో యనన్.

మన సైన్యంబున నపశకునంబు లనేకంబులు గాన్పించుచున్నవి. వీరవరులారా! వెనుకభాగంబున రాజునుంచి చుట్టును గొంతసైన్యంబునమర్చి ముందు మన ముంటిమేని మనలంగెల్చినపిదపగాని రాజును సమీపింపఁజాలఁడు. కనుక యిట్లుసేయుట మన కర్తవ్యము.

దుర్యో—గురువర్యా! ఎంతమాట సెలవిచ్చితిరి? నిజముగ నర్జునుఁడే వచ్చిన మనకుఁ గావలసిన దేమి? పాండవులు పదిరెండువత్సరంబు లరణ్యవాసంబు సలుపునట్లును నొకయే డజ్ఞాతవాసంబు సలుపునట్లు ప్రతిజ్ఞయొనర్చిరి.

గీ. కడఁగి యజ్ఞాతవాసభం । గమ్మునకును
వెరవ కాతఁడే వచ్చిన । మరలనడవి
జేరునట్టుల కట్టడ । జేయువాఁడ
పుడమి బాలింపవచ్చు న । మ్మోదమునను.

దీనికింత శంకింప నవసరములేదు. మనము పాండుకుమారుల జాడదీయుటకైకదా విరటుని గోవులఁబట్టితిమి. అట్టిచో విచార మేల?

చ. నరుఁ డనుశంక యేటికి ఘ । నంబుగ నాతని యబ్బయైన సం
గరమున [illegible]త్సవము । గన్పడ నందఱ మేకమౌచు భీ
కర శరజాలఘాతముల । గంపితదేహుని జేసి కీర్తి చే
వరలెద వైభవోన్నతుల । భాగ్యముభోగ్యములెల్ల బొందెదన్.

మనంబులు స్థిరపరచుకొని యనుమానంబులుమాని శస్త్రాస్త్ర సమేతులమై బలంబుల దీరిచి మొనలకు ముందుగ నిలుతము. ఊరక శంకలబెట్టుకొని ముఖముఖంబులు చూచుచు నిలుచుండిన లాభములేదు. అనుకూల వాయుప్రచారంబు మనకు జయంబుగలుగునని చెప్పుచున్నది. తురంగమహేషితంబులందున కనుకూలించుచున్నవి. కాని గురువుగారు మాత్రమేలకో యీవచ్చువాఁడు నివ్వచ్చుఁడని యతని బెక్కుతెరఁగుల నగ్గించిరి. ఇదియితరులు విన్ననగుపాటని యేల తలఁపలేదో తెలియకున్నది. ఆచార్యపురుషుల నెపుడును గార్యవిషయమై యోచింపవలయునే కాని కదనంబులవిషయమై యడుగరాదు. విప్రపుంగవు లెపుడును గృహంబుల భోజనసమయంబుల సరసవాక్య

ము లాడుదు రి కానియుద్ధంబు సేయఁజాలరు. వారికెవ్వడును దూర
మందుండి మాకువిజయంబు కోరుచుండఁటయేమంచికార్యము.

అశ్వ—(రాజుంగాంచి) రాజా! యేల యిట్లు పలికెదవు? ధనురాచా
ర్యు నధిక్షేపించుట నీకు తగునా?

గీ. గొల్లవారల నదలించి । గోగణంబు
బ్రోచినంతనే నీబాహు । బలిమి తెలిసె
నిదియె నీదగు శౌర్యంబు । నెంచిచూడ
గురుల హాసింప నేటికి । గురువిభుండ.

తన మగంటిమిమీర రాజ్యరమగైకొనిన నిట్లుపలుకవు మాయా
ద్యూతంబున దాయాదుల నోడించి వారిరాజ్యము గొంటివి.
దానికి బదులుతీర్చు కాలము సమీపించినది.

చ. గురుఁడును భీష్ముఁడుంగృపుడు।కుంభిని కాదులు చూచుచుండ నా
వరము పతివ్రతా ద్రుపద । పార్థివనందన నాసభాస్థలిన్
నరగున జీరలొల్వగను । సాహసకార్యము జేసితీవు ని
బ్బరముగు ధర్మమార్గమును । బాటియొనర్పక నాడుభూవరా.

ఉ. వీఁకదలిర్ప నాటుకృధ । వృద్ధినిజెందఁగ డెందమందునే
డాఁకలిగొన్న సింగమున । నర్జునుడేయుటు వచ్చుచుండె పెం
పౌకదనంబుగాంచు యిఁక । నాశపకేమి వృదాభిమానముం
బోక విరోధి తోడఁదగఁ । బోరుము చేతులలావు జూపుచున్.

అజ్ఞాతవాసంబు బూర్తిగావించి వచ్చు నయ్యర్జునుడు రాక దేవదానవుల
కైన శక్యంబు గాదన్న మానవమాత్రులకా వశంబగుట. అజ్జ
నుండన్న నేమనుకొంటివి. వైరికాననదవానలుండర్జునుండు.
అరిసేనాసాగరబడబానలుండు పార్థుండు. విరోధిమహీరుహకు
ఠారుండు ఫల్గునుండు శాత్రవనికాయజలధర మహానిలుండు
కిరీటి. పరిపంథి సర్పవైనతేయుండు శ్వేతవాహనుండు, దుర్వా

రగర్వమదాంధీ భూతవినుత భూపతిమిరభాస్కరుండు ధనంజయుండు. అట్టికుంతీ సుతమధ్యమునితో నీవేకతంబబోరి గెలువవచ్చువనియే దలంచితివి కాబోలు. గురువుగారి నధిక్షేపించుటస్వరము కాని భండనంబున దరిచండ విక్రమంబున విక్రమించు విజయుని గాంచనైన నీకుశక్యమా? సత్పురుషులు విరోధినైనను బలపరాక్రమవంతు నగ్గింతురు. అందునకు శిష్యుని బాగనుట గురునితప్పా! నీయున్నంబుదినునంతమాత్రముననచ్చిష్యుని బాగడరాదె? ఇప్పుడు సిగ్గుమాని రణం బాచార్యుండొనరించిన నొనరించుగాని నేనుమాత్రి మర్జునునితో రణంబు చేయును. విరటుండె గోవుల మరలింపవచ్చిన దాకియుద్ధమ్మొనర్తును.

కర్ణు—(కోపముతో) ద్రోణాయనీ!

శా. ఏలాపల్కితిదాదిగోవులకు నెం । తేమోదమొప్పారంగా
లీలం బట్టమటంచునాడు నిపుడున్ । లేశంబుశంకింప మీ
కేలా పార్థుండెవచ్చుగాక మదిలో । నీరీతిభీతాత్ములై
బేలం జేయక మేలె భూపతిని స । ద్వీర్యంబు శోభిల్లగన్.

గీ. భయముపడిరేని జేసుండు । కట్టణమున
కింపుబొంపొందననిలోన । నిపుడనిల్చి
పోరుసలిపెద గవ్వడి । పొగరణంచి
మించువిజయంబుచే । బరిసించువాడ.

ఉ. భండన పాండిత్యంగలిగి । భార్గవశిష్యుడ నెంచునెంతయుం
దండి మగండనంగ దగి । దర్పసముద్యతనీడు లేక వే
దండపురాధి నాయకుని । దండవసించుచు నొప్పుగన్న నే
భండనమున్న భీతిలెడి । వాడ శత్రులజూచిమీనలెన్.

భూపతి నన్ను మున్నవగావించి యంగరాజ్యంబిచ్చి మన్నించిన గౌరవంబు దినదినంబు బెరుగుచున్నది. అందులకు బ్రతిగనేను

కవ్వడితోడి రణంబు తటస్థించినది అర్జునుని కయ్యంబున గెలు
తునని పలుమారు కసితో బలుకుచుందును. లోకంబున కర్ణా
ర్జునులలో ఘనుఁడెవ్వఁడో యను సందియంబుగలదు. దానిని
నేఁడు బాపెదను. ఈరోజు మహాసుదినము. మనంబున రవులు
చున్న క్రోధమహానలజ్వాలను ప్రజ్వరిల్లనిచ్చి పాండవ మా
ధ్యమానలుని మద్భరత పర్వంబున ముంచి చల్లార్చెదను.
పార్థుఁడు పదుమూఁడేఁడులు వనవాసాయాస మనుభవించి రణో
ద్యోగంబున వచ్చుచున్నవాఁడుకదా? నేనును గురుసైన్యంబు
న భుజబల పరాక్రమదక్షుఁడనన పేరొంది యుంటిని. కావున
నా శౌర్యప్రకటనంబునకు నదును దొరకినది.

కృపు—కర్ణా!

గీ. రాజు కార్యవాది । యోజింప భీష్ముండు
గురుఁడు సత్యమార్గ । చరులుసుమ్ము
కడఁగి కయ్యమునకుఁ । గాలుద్రవ్వెదవీవు
నర్థసిద్ధినెట్టు । లందవచ్చు.

పార్థునొక్కరుండనె తాకెదనని ప్రగల్భము లేలపల్కెదవు? ఇందు
లకు రాజు సంతసించును. కాని కార్యము మాత్రము కాదు.
అర్జునుఁడొక్కరుండేకదా వచ్చుచుండె. అతనితోఁ బోర నాకే
మిభయమని తలంచెదవేమో? ఇంద్రాదిసురలతోఁ బోలి ఖాండ
వంబగ్నికాహుతి యిచ్చునపుడును, యాదవబలంబుల గలన
నిర్జించి సుభద్రం దెచ్చునపుడును, సకల దిగ్విజయంబుగాం
చునపుడును, గంధర్వ విభుఁడగు చిత్రరథునితో గయ్యంబొ
నర్చి నెయ్యంబుమీర నిన్ను విడిపించునపుడును, కాలకేయా
దుల కాలుపోరిలి కనుపునాఁడు నాతఁడొక్కరుండేకదా? ద్రౌ
పదీస్వయంవర కాలంబున నృపులెల్లరు కలహించినపుడు నీవ
చట లేవా? రాజు లేఁడా? అతను బలపరాక్రమ మందుండఁగు
నర్జునుఁసిలావు సీవెరింగి యుండియు నిట్లుపలుకుట చాలయచ్చె

రువుదయించుచున్నది. రాజమాత్రము నీవాక్యములకు భళీ
యని తాళవుచేయుచుండెను. అర్జునుఁడన్న

చ. సురపతియైనగాని కదు । చొక్కపుటించు జయంబువీసి యీ
శ్వరుఁడయినన్ రణంబున వ । శంబగునన్న యిఁకెవ్వఁడేనియూ
వరుసెమటంగరంబయిన ర । ణంబునదిప్పు సమర్థుఁడే? యుహా
దుర మొనరింతు నన్నుమది । దోచునే నిక్కమటంచు సూతజా!

జాజ్వల్యమానఁబగు దవానలం బార్పనొక్కని శక్యంబగునా? మన
మందరము కూడి తాకినను బార్థుని జయించుట చాలదుష్క
రము. రాజును గాపాడుట మనకర్తవ్యము. కావున నీవాకరుం
డవు తాకలేవు. ఎందులకు గొరవమాలిన మాటలాడెదవు.

కర్ణు—కృపాచార్యా! రాజద్రవ్యంబుదినుచు నరుల నుగ్గడించుట మీ
కుగల కృపాతిశయంబు దెల్లంబగుచున్నది.

గీ. యజ్ఞయాగాదికర్మల । ధ్యయనములకు
వెలయుసంతర్పణంబుల । విప్రవరుల
బిలువవలయును సామర్థ్య । మలరుకతన
బిలువగారాదు రణకేళి । వెలయునిపుడు.

పార్థునకు భయపడిన మీరేమియుద్ధముచేయఁగలరు? కావున నింటికిఁ
జని సుఖంబుండుడు. నేను సాధనస్సు నెక్కువెట్టి శరజాలంబు
న నర్జునుని నించి ముంచి లిప్తమాత్రంబున విజయంబుగాం
చెదను. అర్జునుఁడన్న నాకుఁ దృణప్రాయుండుకదా?

భీష్మ—(రాజునుగాంచి) దుర్యోధనా! ధర్మమార్గ గామియగుట
నాచార్యుండు సత్యము వక్కాణించె. కృపాచార్యునిపలుకులు
తెప్పైనయున్నవి. నీమన్నన నందియున్న యంగరాజుమాత్రము
రణోత్సుకత్వంబున భారద్వాజాదుల ధిక్కరించుచున్నాఁడు.
కాని వానికి ధర్మాధర్మవివేకము తెలియదు. విరోధియందలి

సుగుణంబుల బొగడుట ధర్మమార్గవిరుద్ధముకాదు. ఆచార్య వర్యా! కృపాశ్వత్థామాది యోధవరులారా! వచ్చువాఁడు విజయుఁడు. మనలోమనము కయ్యములాడుచు నిలుచుట ధర్మముకాదు. మనమందరము కలసి కలనంబొనర్తము.

దుర్యో—తాతగారు! "ఆలులేదు చూలులేదు. కొడుకుపేరేదియో" యనునట్లు అర్జునుడు వచ్చుటయులేదు. ఏమియులేదు మన సంబరమే యిట్లున్నది.

కర్ణ—ఫల్గుణుఁడేలవచ్చును? వచ్చినతిరిగి కాననంబుల కేగవలసినదే.

దుర్యో—అజ్ఞాతవాసపూర్తినిగురించి భీష్ముండు వచింపవలయును.

భీష్మ—రాజా! కౌరవేశ్వరా! పాండవులయజ్ఞాతవాసదీక్ష నిన్నటితో బూర్తియైనది. సకలశ్రమలఁబడి వనవాసయజ్ఞాతవాసంబులొనర్చిన పాండవులు సమయభంగంబు గావింతురా? అట్లెన్నటికి జరుగదు.

చ. నరుఁడిటువచ్చుచుండె నర । నాయక తథ్యముసుమ్మినేడు సం
గరమున నాతనిం జెనకి । కాంచగలేము జయంబు వాఁడు దు
ష్కరజాల పాదమున । జర్ఝరితాంగుల జేసిమీకు నా
పురుషుని రీతి నెంచగను । బోలదు బోలదు నామనంబునన్.

(తెరలోకలకలము.)

ద్రోణు—కౌరవేంద్రా! ఇప్పటికైన బ్రాహ్మణంబులు బుద్ధులుసేయు బాధ్యదేవదత్తరవంబు లింటివా? ముందుసంగతివిచారింపుము.

కర్ణ—మీరందరు రాజమనంబుగలఁతపెట్టకుఁడు. నరునకు భీతిల్లి మీరు పిరికితనంబు వహించిన వహింతురుగాక!

మ. నరుడేవచ్చిన మేలుగాదె మనకున్ । నా గాచ పాదంబునం
గల మొప్పారఁగఁద్రుంచి కాంతుజయముం । గల్యాణముల్గల్గదే
త్వరఁగా జేరుచు భీతిపొందినను భ । ద్రింబుండగా నింటికిం
గురునాథుం గలిపింతు నేనొకఁడనే । కొంకేమియుఁ జెందకన్.

అశ్వ—ఏమి? రాధేయా! నీవొక్కరుండవే దాకెదవా? ఆహా! నీసాహసము వర్ణనాతీతమైనదే ఇట్టిబలపరాక్రమ సంపన్నుఁడగు వీరాధివీరుండు దండనుండ మాకురుపతి కేమి కావలయును.

క. గంధర్వరాజుచేతను
బంధింపగ బడినవిభుని । వదలించు నెడన్
మంధరసమధైర్యుఁడవే
పంధంజని నీకుశౌర్య । పటిమయుఁ జెపుమా.

అర్జునుడేకదా విడిపించె. ఎందు కీరజ్జులు పలికెదవు?

ద్రో—ఎంతెంతమాటలైన బలుకవచ్చును. గాని చేసి చూపుట దుష్కరముగదా?

కర్ణ—ఆచార్యా! ఏమందువు? పలుకవచ్చుగాని చేసిచూపుట దుష్కరమా? పిఱికిపందలగు భూసురులవలె నేనును పిఱికివాఁడనను కొంటివా?

గీ. అరయ సంతర్పణములందు । నరసిగాదె
లతిసుకరముగ విరచెదు । ధృతివిలాసు
లాహవంబున రిపువేయు । నస్త్రశస్త్ర
తతికిదాళుకు రేష్ఠి । ధైర్యులగుచు.

కూటికిలేక మాకురుసార్వభౌమునిజేరి యిచ్చకంబులాడు మీకేడ? రణంబుసేయుటేడ?

అ—(కోపముతో) ఓరీకర్ణా! ఆత్మస్తుతిపరాయణా! సూతకుల సంభవా

గీ. కనులు పొగరెక్కెనానీకు కర్ణ? సకల
కురుకుమారుల కాచార్యు । డరయ భువన
ఖ్యాతుఁడను ప్రసిద్ధవీరుఁడను । ధీరుడైన
ద్రోణుదూషింప నెంతువా । దుర్మదమున

కర్ణ—(కోపముతో) ఓరీ ద్రోణాయనీ!

గీ. సూతుఁడనటంచు బలికెదు । జాతికేమి
ఖ్యాతిగాంచిన పౌరుష । కలితునిటుల
నిందగావించు పాపాత్మ! । నీదుశిరము
వ్రేయువాఁడనె బ్రతికితి । విప్ర! పొమ్ము.

అశ్వ—ఓరీ! నీవుసూతస్త్రీము కురురాజునొద్ద గూటికిజేవలేదా? ఎవ్వరైన నుదరపోషణార్థమెకదా ప్రభువుల సేవింతురు. నాశిరము వ్రేయదలచి విడచిన దయాసాగరుఁడవు. ఆహాహా! ఈదుర్యోధనమహారాజునుజూచి నీతల ద్రెవ్వనేయక విడచితిని. ధనుర్విద్యాచార్యుని దూషణము బొనరింతువే.

కర్ణు—(వికటముగా) రాజునుజూచియైన నన్ను మన్నించితివి పోనిమ్ము. రాజా! వీరిపలుకులు పాటిసేయకుము?

గీ. చూచితే వీరువైరివి । చోద్యముగను
బాగడఁచుండిరి వాక్యనం । స్ఫూర్తి వెలయ
దిన్నయింటకు వాసాల । లెన్నఁగనలు
వీరలాహావంబెట్లు గా । వించువారు.

అశ్వ—ఓరీ! సూతకులాధమా! తిన్నయింటను వాసెనులెన్న మేమేమియు సేయజాలము గాని నీవొక్కరుండవె రాజు నుద్ధరింతువు. పరమపావనులైన పాండవుల రాజ్యమపహరించి మించిన గర్వంబున నేనె మహాప్రబుద్ధుఁడనంచు గర్వించు నీవు రాజు చే మన్ననల గాంచితినని కన్నుమిన్నుగానని నీవు, గురుదూషణ మహాపాపకార్య మొనరించిననీవు, నీచబుద్ధిని విడువక పరమ పతివ్రతకు భంగపాటుదెచ్చిన నీవు ఈవ్రేటున జచ్చితివిరా?

(అని కత్తిదూసి కర్ణునిపై బడును.)

కర్ణు—ఆఁ! చచ్చితివిరా! (అని అశ్వత్థామపైనేగును.)

(కృపదుర్యోధనులు వారించుచున్నారు.)

అశ్వ—(కృపునిగాంచి) మామా నన్నాపకుము.

గీ. ఎగసిపడుచుండె నేన పో । హితుఁడనంచు
భూమిపాలుండు తన్నంత । బొగడుచుండ
దుర్మదంబెల్ల దూలించి । కూర్మిమీర
విభుని గెలిపింతు సంగర । పృథివినిలిచి.

కర్ణ—రాజా! సుయోధనా! రానిమ్ము! ఈకృపాణధారకు బలిసేసెదను. మీకేమి భండనంబు సేయఁగలరు? బావలున్న నొకటే లేకున్న నొకటే.

అశ్వ—ఓరీ! కర్ణా! దుర్వారగర్వ మదాంధీభూతా!

ఆ. వె. అంగవిభుఁడనంచు । బొంగంగ నీకేల
కులమువృత్తి దెలిసి । కొనుముకర్ణ!
కారుమాతలాడి । ఘనులను దూషింపఁ
గలవుగాని సేయ । గలవె రణము.

విప్రులు సంగరంగమందు జయంబుగొన్నది లేనిది నీకేమి తెలియునురా? సకల రాజన్యోత్తమాంగకర్తన పటుప్రౌఢగు బరశురాముం డెకులంబువాఁడో? దుర్వారగంభీర విజృంభమాణ మహార్ణవంబాపోశనంబుగొన్న కుంభసంభవుం డెవ్వండో? సకల సురగణమకుట రత్నాలంకార పాదపంకేరుహుండగు శచీనేతను రాజ్యభ్రష్టునిజేసిన దూర్వాసుండెవండో? రథచోదకవృత్తి జరించు నీవు రథికునివలెనిలిచి యుద్ధమొనర్తువె. కురుపతి మన్ననలందుకతన గర్వించి దర్పించి గురుదూషణం బొనరింతువా? నాతండ్రి శాంతించియుంటచే బ్రదికితివి.

దుర్యో—ఆచార్యపుత్రా! ఈసమయమున మనలో మనకేనా కలహము.

కృపా—కర్ణా! మీలో మీరేనా కలహించుట.

కర్ణ—నేనవజ్ఞాగురుడనని కుత్సితబుద్ధిని వైరిని బొగడుచు రాజును దూషించు నీపారుడు మేలో, సూతకుల సంభవుడనయ్యు రాజ హితంబుగోరు నేను మేలో, నీవెంచి చూడుము.

భీష్మ—కర్ణా! త్రిలోక పూజ్యుండగు నీభరద్వాజుని దూషించుటయె కాని నీవేమియు నెఱుంగవు. ఒకమూలనుండి విరోధి మనపైకి దాడివెడలి వచ్చుచుండె. మీలోమీరు పోరాడుచుండిన నిక కార్యంబెట్లుసాగును? రాజా! కార్యసందర్భమాలోచింపక యూరకొనుచుంటివేమి? మనపైకివచ్చువాడు విష్వచ్చుడు. అతనితోఁ బోర సమర్థుఁ డీకర్ణుడొక్కరుండుకాడు. మనమందరము గూడుకొని పోరాడవలయును. కావున కార్యాంశంబు విచారింపుము.

దుర్యో—(కర్ణునిచేరి)

గీ. మిత్రపాండుకుమారులు । శత్రులైన
వారిదూషింపఁగోపింతు । వీరుకాన
నన్నుగాంచియు శాంతించి । మిన్నకుండు
మయ్యకార్యభారంబు నా । యందెయుండె.

(అశ్వత్థామనుగాంచి) ఆచార్యకుమారా! నాప్రార్థనంబాలించి శాంతి వహించి కార్యదీక్షబూనుము.

అశ్వ—మమ్మేమియు వేడ నవసరములేదు. గురునిఁబ్రసన్నచిత్తుని జేసికొనుము.

దుర్యో—(ద్రోణునిజేరి) ఆచార్యవర్య!

ఉ. అర్జునుఁడేగుదెంచెనిటు । లాహవకేళియొనర్ప ధీరుఁడై
కర్జములీరలుంగలిసి । కాంచుడుయుద్ధవిధానతత్వముం
దూర్జటియైనగాని యని । దోగుటనన్న విచారమేల సం
స్ఫూర్జితశక్తితోఁ బగను । బోరుడు మమ్ముల గూర్పుకింపునన్.

గీ. కార్యభారంబు మీయందె । కలదు గాన
నేను జెప్పంగ నేటికి । విప్రవర్య
వినతి గావింతు మీపాద । విమలకంజ
యుగమునకు శాంతి జెంది మీ । రోముడయ్య.

ద్రోణు—గాంధారేయా! భీష్ముని వాక్యంబులె మమ్ము శాంతచిత్తుల జేసినవి.

భీష్మ—మనబలంబున జతుర్థాంశంబుగొని ముందుగ భూపాలుం డరుగవలయు. గొంతసేన గోవులతోడ నుండును. తక్కినసగము సేనతో మనము వ్యూహంబుబన్ని యరుగుదము. ఇట్లయిన రాజు సురక్షితుండగును.

(ఉత్తరసమేతుండై యర్జునుడు ప్రవేశించుచున్నాడు.)

అర్జు—ఉత్తరా! మత్స్యరాజాత్మజా!

గీ. దురభిమాని గర్వాత్ముండు । కురువిభుండు
కలండె మొలలోనగలయంగ । గనినపిదప
వ్యూహ మావలపక్కగా । నోహటించి
రథముపోనిమ్ము యుత్తరా! । రయముమీర.

గీ. ఇభము చిక్కిన సైన్యంబు । విచ్చుసుమ్ము
గోచయంబు మరల్పంగ । గొంతయదను
జిక్కు మనకును గాన ని । శ్చింతతోడ
జయము లభియించు వేగమె । శ్రమము లేక.

ఉత్త—ఇదె నీయానతి ననుసరించుచుంటిని. (అనిరథము తోలును.)

అర్జు—(సైన్యమాతను బారజూచి) ఉత్తరా! ఈసైన్యమునందు గర్వగరిష్ఠుండగు దుర్యోధనుండు లేడు. అతండు గోవులతో నుండవచ్చును. ఇప్పుడు వీరాన్నుపజేరకుండ మనము గోవులమరలింతము. ఇంతలోవీరు చేరిన సమరం బొనరింతము. గురుకృప భీష్మాదులగాంచి బహుకాలంబైనది. కావున వారికినమస్కార

బాణంబుల విడచి మ్రొక్కెదను. (అని యస్త్రముల చేయుచు నమస్కరించును)

ద్రోణ—(భీష్మునిగాంచి) గాంగేయా! అర్జునుని గురుభక్తి విశేషము గాంచితివే. ఇట్టి శిష్యుని బడసిన గురుని భాగ్యమేమన వచ్చును?

భీష్మ—ఆచార్యా! ఈతనిబాలకాలమునకు గాంచితిమి. ఈతనిబోలు మహానుభావుఁడెందును లేడు. మనవెనుకవక్కకువచ్చియు మనతోఁబోరనిష్టంబులేక తనకిరీటంబు నీక్షింపుచు నుండు జనెను. ఇదికాంచిన నిచట దుర్యోధనుఁడు లేనిసంగతిగాంచి రాజును గూడ ముట్టునుద్దేశ్యంబున ముందు చననోపు. ఆతండు మన కురు గురువిభునకును మధ్యజొచ్చిన విభుఁడొంటిగఁ బోరఁజాలఁడు. కావున మనమందరము నాతని జేరుదమురండు.

(అని నడచుచున్నారు.) (తెరలో)

గీ. ఆల మరలించినాఁడ మీ । రతిముదమున
గోవులను దోలుకొనిపొండు । కొంకులేక
మమ్మునరికట్టుకురువీర । మండలంబు
జించిచెండాడి వత్తును । శీఘ్రగతిని.

(అర్జునుఁడు నుత్తరుఁడు ప్రవేశింతురు)

ఉత్త—అయ్యా! ఇక్కురువీరులెవ్వరెవరో వేరవేర నిరూపించి చెప్ప గోరెదను.

అర్జు—ఉత్తరా! ఉదయమార్తాండ సదృశవిగ్రహుండగుచు భీష్ముండు

గీ. పరశురాముగెలిచిన । బల్లిదుండు
విల్లువిద్దెనుమేటియై । వెలయువాఁడు
పాటిపడగఁవా డసిలోన । సాటిలేని
వీరుఁడాతండు భీష్ముండు । వినుకుమార!

ఆతండు కౌరవుల శత్రువుండుండినను మాయందధికప్రేమం
బున నుండును. ఆతనితో బోర నారుద్రునకేని వశంబుగాదు.

ఉత్త—ఆతనిప్రక్కనున్న కనకవర్ణ శరీరుండును వేదికాధ్వజుండు
నరుణాశ్వబద్ధరథుండునగు భూసురుండెవండు.

అర్జు—ఉత్తరా!

కం. విలు చేత బట్టనేర్చిన
బలులకు నాతండుగురుండు । పరికింపంగా
కలనను బోరంగం జాలరు
దలంపగ నెవ్వారలైన । ధరణిప తనయా.

ద్రోణాచార్యులను నామనంబున విలసిల్లు నీతనితో మనము సమరము మునుమున్న చేయరాదు. ఎల్లప్పుడు నన్ను బ్రేమించుచుండును. దుర్యోధనునితో నేను పోరునప్పుడాచార్యుండు సమరంబు నాతోడ నొనర్చునో లేదో చూడవలెను.

ఉత్త—ఆద్రోణునిప్రక్క కరవాలధరుండగుచు మొగంబు జేవురింప మనవంకగాంచుచున్న వీరుండెవ్వడు.

అర్జు—గీ. ద్రోణతనయుండు నవిజేత । రుద్రమూర్తి
దేవతలనైన రణమందు । ధిక్కరించు
శివునివరమున జన్మించె । క్షితినితండు
వీరుడాత డశ్వత్థామ । పేరవరలు.

అదెకాంచుము. ఆతనిప్రక్కనున్న గోవృషపతాకవాండు శాంతమూర్తి, కృపాచార్యుండు, మత్పితృసఖుండు, శస్త్రవిద్య ద్రోణసమానుండు. మాకు జిన్నతనంబున ధనురాచార్యుండై యుండె. ఇవ్వీరవరులతో మనంత మనము కయ్యమునకు గాలుద్రవ్వరాదు. వీరడ్డువచ్చిన రథంబు మెల్లమెల్లగ దాటించుకొని పోవలయును.

ఉత్త—అర్జునా! చూడుము. అనంతకిరీటంబుదాల్చి కుండలాలంకృతుం
డై రోషకషాయితేక్షణంబుల మనలజూచు వీరుఁడెవండు?

అర్జు—కుమారా!

మ. అతఁడేఁ కర్ణుఁడు శూరుఁడాజి రిపున । న్యాయంబునం గెల్చునా
తతమాయావివృథాభిమాని యలరా । ధాగర్భసంజాతుఁడ
ప్రతిమానప్రభుఁడిష్టమిత్రుఁడు సదా । కల్యాణబ్రతాపంబులన్
దతినాతోఁడఁచనంగదెచ్చె నితనిం । భంగింతు సుముత్తరా.

ఇతనికి జామదగ్న్యుండు గురుండు శస్త్రవిద్యావిశారదుండు, నాయందు బద్ధమత్సరుండు. మొదటినుండియు దుర్యోధనుండు నన్ను నిర్జింపఁజేయునుద్దేశ్యంబుతో నీతని జేర్చెను. నేటి యుద్ధంబున మాయికపురకరలాఘవంబుల బ్రయోగ చమత్కారంబుల నీవు కనిపెట్ట సమయము తటస్థించినది. అల్లదె మణిమయ కిరీటాలంకృతుండై గదాధరుండై యున్నవాడు దుర్యోధనుండు. ఈకురుకులపాంసనుండే మాకు బాల్యమునుండియు బెక్కు చిక్కుల నుత్పాదించెను. కపట ద్యూతంబున మమ్మునోడించి వనవాసాయాసంబు గల్పించిన దీతండె. విషాన్నంబు బెట్టి లక్కయింట మమ్ముల కగ్ని దరికొల్పె.

గీ. రణముసేయంగ సమకూరె । రాజుతోడ
నేను నేఁబరాజితునిగా । నృపునొనర్తు
రథముబోనిమ్ము యుత్తరా । రయముమీర
నెవ్వరడ్డంబువచ్చిన । నిపుడగెల్తు.

కొన్ని విధంబులు గష్టించియైన రాజును జేరవలయును. మత్పితామహుండగు భీష్ముండు కురువృద్ధుండు. సకలశాస్త్రవిద్యా రహస్యజ్ఞుండు. మాకును గౌరవులకును నెపుడు హితంబు గోరుచుండును. కాని మనము రారాజుతో బోరునప్పుడు వారించునో లేదో తెలియదు.

గీ. తేరుబోనీకు గాంగేయు । దిక్కునకును
మత్స్యరాజాత్మజా! నీవు । మరచితైన
నాతఁడలిగిన సిలుగుల । నందఁజేయు
బోలభారంబు మనకగు । బుద్ధిజూడ.

అశ్వ—(కర్ణునిజూచి) కర్ణా! ఇంతకుముందు నిన్ను నీవే పొగడుకొంటివి పదుమూడేండ్లు వనవాసాజ్ఞాతవాసంబులు నలిపి తన చేతుల తీటతీర్చుకొనుట కర్జునుఁడు వచ్చియున్నవాఁడు నీవీతని దెబ్బలివలె మార్కొనరాదా?

కర్ణ—ద్రోణాయినీ! ఈమాటలకేమి? అర్జునుఁడరుగుదెంచెనని నేభయపడుదున ననుకొంటివా యేమి?

అర్జు—కర్ణా! వీరాగ్రేసరా! చాలదినంబులకు నిన్ను గంటిని. నీకునీవె బలశాలిననియు శౌర్యవంతుడననియుఁ బలుమారు పల్కుచుందువు. నీ బాహుబలిమిఁ జూచు వేడుక నేఁడీకవ్వడి వచ్చియున్నాడు. నీప్రతాపంబు గనఁబరచి నన్నానందపరవశునిఁ జేయుము. గురుభీష్మాదివృద్ధులుగాంచుచుండ సామంతభూపాల మండితంబగు పేరోలగంబున పరమ పతివ్రతయగు ద్రోవదినిజూచి నవ్విన ఫలంబు వడ్డితోఁగూడఁదీర్పవచ్చితిని. అప్పుడసమయమగుట ధర్మపాశబద్ధులమై శాంతివహించి యూరకొంటిమి. యిప్పుడు నాకంటబడిన నీవెచటికిఁబోఁగలవు? పారిపోక నిలువుము.

కర్ణ—ఓయీ అర్జునా!

గీ. వీరకృత్యమ్ము లెన్నొగా । వించితివట
చూపగావలయును మాకు । సురుచిరముగ
నిన్ను సమయించి విజయంబు । నృపునకిత్తు
నన్ను బెంచిన రాజు ఋ । ణంబుదీర.

నీవీరత్వంబు గనఁబఱపుము.

అర్జు—ఓహో! నాపరితాపంబుగాంచెదవా? అటులయిన మరియు మంచిది.

(ఇరువురుకొంతసేపుపోరుదురు. కర్ణుఁడు పారిపోవును.)

అర్జు—ఉత్తరా! రారాజబలంబున మేటిమొనగాఁడనదగిన వీరుండు కర్ణుడీరీతిఁ బారిపోయెను. ద్రోణాదుల దాటినగాని దుర్యోధనునిదరికరుగలేము. (ద్రోణునిగాంచి) మహానుభావా! ద్రోణాచార్యా! మద్గురూత్తమా! వనములఁ బెక్కుశ్రమలపడి వనవాస యజ్ఞాతవాసంబుల బూర్తిచేసి యిప్పుడు రణకాంక్ష వచ్చితిఁ. రాజునుజేరకుండ నన్ను చిక్కులుపెట్టక కరుణింపుము. (అని నమస్కరించును.)

ద్రోణు—ఏమిరా! గురువులతో బోరుటకే మది నిశ్చయించితివా?

అర్జు—మహాత్మా! నేనట్టివాఁడనుకాను. నన్ను చిక్కులుపెట్టిన నేమి చేయఁగలను?

భీష్ము—అట్లయినచో రణంబు సేయుటయే నిశ్చయము.

అర్జు—దారి యీయకపోయిన,

ద్రోణు—అట్లే కానిమ్ము.

అర్జు—గురువర్యా! ముందుగ మీరే శరప్రయోగము సేయుడు.

ద్రోణు—(నవ్వి) ఇచట పిన్నపెద్దల తారతమ్యమేల?

అర్జు—గురువెప్పుడును వందనీయులుకదా?

ద్రోణు—(బాణప్రయోగము సేయుచు. నాకులసమరముగావింతురు.)

అర్జు—ఓయీ! సుయోధనా!

గీ. చిన్నతనమునఁ దండియు । సిలుగులెన్నొ
చేసినాఁడవు తత్ఫల । సిద్ధినీకు
నందఁజేసెద వేడ్కనే । నరుగుదేర
గవయువేమి భయపడియో । కౌరవేశ.

ఓరీ మూర్ఖా! మహాసభామధ్యంబున పతివ్రతాశిరోమణియగు పాంచాలికెగ్గుగావించిన ఫలంబును మహాధర్మాత్ముండైన ధర్మసుతుని మాయాజూదంబున వంచితునిగావించి వనవాసంబున కనిచినఫలంబును వృకోదరునకు విషాన్నంబుపెట్టి నీట ద్రోచిన ఫలంబును లక్కయింట మమ్ముల నగ్నికాహుతి సేయనెంచిన దుర్యోజనాఫలంబును నీకు వడ్డితోఁగూడ ముట్టఁజెప్పెదను.

దుర్యో—ఆఁ! ఏమిరా ప్రేలుచుంటివి.

మ. ఘనబాహాబలమేర్పడంగ నిను నీ । కయ్యంబునంగెల్చి మిం
చిన మోదంబున రాజ్యపాలనము నే । జేతుంబ్రతాపోన్నతిన్

అర్జు—నృపకంఠీరవా! ఇఁక యేమి?

మ. అనుమానంబది యేల డాయుము వెసన్ । హర్షంబు సంధిల్ల నా
కును వైరంబువశించు నీకతనపో । పెక్కుల్మాట లింకేటికిన్.

దుర్యో—కయ్యమొనర్తము రమ్ము (ఇరువురు పోరుదురు.)

అర్జు—ఓరీ దుర్యోధనా! సకలసామంత ధీమంత పరివృతంబగు మహాసభామధ్యంబున మాభీమసేనుండొనర్చిన ప్రతిజ్ఞదలంచి నిన్ను నిప్పుడద్రుంచుట మానితిని. లేకున్న నీపని పూర్తి జేసి యుందును. (ఇంచుకయూరకుండి) ఉత్తరా! మనమీ కురువీరులనెల్ల సమ్మోహనాశాస్త్రంబున మూర్ఛితులఁజేసి వీరి శిరోంబరంబులగొనిపోయి యుత్తరబొమ్మపొత్తికలకిత్తమురమ్ము (అని సమ్మోహనాస్త్రంబుప్రయోగించును. అందరుమూర్ఛిల్లుదురు.) ఉత్తరా! ఈయస్త్రంబునకు ప్రత్యస్త్రంబు భీష్ముండెఱింగి యుండును. కావున తక్కినకురువీరుల శిరోవస్త్రంబుల నుండి బొమ్మ పొత్తికలదెమ్ము.

ఉత్త—(తలపాగఁగోసికొనివచ్చును.)

అర్జు—ఉత్తరా! మనము వచ్చినపని పూర్తియైనది. గోవులనుమరల

బడి క్షేమంబున ఇండ్లకు జేరినవి. కౌరవవీరులు మరలిపోయిరి. కావున సత్వరంబుగ రథంబు పురంబు జేర్పుము.

ఉత్త—మంచిది. (ఇరువురు నిష్క్రమింతురు.)

(అందరు లేచుచున్నారు.)

దుర్యో—అరే కుంతీసుతమధ్యమా! ఎక్కడికిపోయెదవు నిలునిలుము.

భీష్మ—దుర్యోధనా! ఎందులకు వేగిరించెదవు. వాఁడు దయామయుం డగుట మనల జంపక విడచి శిరోంబరంబుల మాత్రము గైకొని పోవుచున్నాడు. మరల నెదిరించితిమేని మనల దన బాణాగ్నికి బూర్ణాహుతి గావించితీరును. విచారంబుదక్క పురంబునకు బోదమురమ్ము.

(అందరునిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.





శ్రీ శారదాంబాయైనమః

# పాండవాజ్ఞాతవాసము

## సప్తమాంకము.

రంగము—విరటుని సభామందిరము.

[సింహాసనస్థుఁడై ధర్మరాజు, ప్రక్కనుగూర్చుండి ద్రౌపదియు, వీరిని సేవించుచు భీమార్జున నకులసహదేవులు ప్రవేశింతురు.]

[విరటు డుత్తరుఁడు ప్రవేశింతురు.]

విర—(ధర్మరాజునుజూచి) కంకుభట్టా! ఏమి నీగర్వము. నాసింహాసనంబెక్కి నన్నుజూచియైన నిర్విచారంబుననుంటివే. ఇంత దుర్మదము నీకు దగునా?

అర్జు—(నవ్వుచు) భూమీశా! ఆగ్రహింపకుఁడు. సకలరాజన్య మూర్ధన్యపాదపంకేరుహుండగుచు రాజసూయాధ్వరంబు గావించి యజాతశత్రుండన ప్రసిద్ధిగన్న యీరాజమార్తాండుడు, దేవేంద్రుని గద్దియయైన నెక్క నర్హుండుకదా? అట్టివాడీ చిరుత గద్దియ నెక్కఁదగఁడా?

విర—(ఆశ్చర్యముతో) ఏమిబృహన్నలా! ఈతండు ధర్మనందనుండా! అయ్యో! తక్కినవారెక్కడ?

అర్జు—రాజా! నిజముపలికెద వినుము.

గీ. వంటవృత్తిని బూనుచు । వలలుఁడనఁగ
నిన్ను గొల్చినవాఁడు భీ । మన్నసుమ్ము

హాటకములను గోచయముఁబ్రీతి । నాదరింతు
కథలువీరుమన్ననగాని । కాంక్షతోడ.

సైరంధ్రీవేషంబున మాలినియను నామంబుదాల్చి సుధేష్ణాదేవిని గొల్చుకాంతయే పాంచాలి. ఆమెకారణంబున గంధర్వుఁడను పేరంబున కీచకులందఱ భీమసేనుండ వధియించె.

భీము—షండరూపంబున బ్రచ్ఛన్నవేషంబునఁ గన్నియలకు నృత్త గీతాదుల నేర్పుచు బృహన్నలయనంగ నిన్నుసేవించి యుత్తరునకు సారథియై పిదప రథికుండై గోవులమరలించుకొని కురువీరుల మార్కొని విజయంబు గొనివచ్చినవాఁడే యీవిజయుండు.

ఉత్త—తండ్రీ! ఈసంగతియంతయు నాకు నిన్నటిదినముననే తెలిసినది. ఈతండు వెలిబుచ్చవలదని వక్కాణించుటచే మఱుఁగుగా దేవతుల్యుఁడంటిని. ఈవీరాగ్రగణ్యుని దేవతుల్యునిగా నన్నరాదె.

విర—ధర్మరాజా! నీయెడ నేనపరాధంబు చేసితిని. బృహన్నలదేవి జయంబని నీవు వచించినప్పుడు కోపించి సారెగొని నిన్నుఁ గొట్టితిని నాతప్పు మన్నింపుము.

ధర్మ—విరట ధరణిపాలా! ఇందు నీతప్పేమియు లేదు. నీయండ తల దాచుకొని శ్రీరుక్మిణీకాంతుని యనుగ్రహవిశేషంబున మాయజ్ఞాతవాసంబు పూర్తి జేసితిమి.

[శ్రీకృష్ణుఁడు ప్రవేశించును. అందరునమస్కరింతురు.]

ధర్మ—మహాత్మా! నీదయావిశేషంబున మాయజ్ఞాతవాసదీక్ష తీఱినది. నీకటాక్షమున్న వారికేకొఱంతయు రాదుకదా.

కృష్ణ—సర్వము దైవాధీనము.

విర—పాండవేయులారా! మీయెడల నేనొనర్చిన యపరాధంబులు పెక్కులుకలవు. వానినెల్లమన్నింపుడు. నాకోరిక యొకటికలదు.

అయ్యది వాసుదేవుని సమక్షమున నే తీరవలయును. అస్మత్కు-
మారీ రత్నంబగు నుత్తర నర్జునుండు వివాహమాడవలయును.

అర్జు—రాజా! ఈకాంతకు నేను నాట్యాచార్యుండనై యుంటిని. నే
వివాహమాడిన నన్ను గామగ్రస్థునిగ లోకంబుదలంచును
కావున మదీయకుమారుండభిమన్యు డీయుత్తరకు బతికాఁ
గలఁడు.

విర—ఎట్లయిన నాకు సంతోషమే. మీతోడివియ్యంబునకన్న నాకు
గావలసిన దేమి?

కృష్ణు—తథాస్తు.

విర—ఎవరక్కడ? (ద్వారపాలుఁడు ప్రవేశించి)

ద్వార—దేవా! ఏమి సెలవు?

విర—ఉత్తరావివాహమునకు సర్వము సిద్ధపరపుమని నాయాజ్ఞగా
శంఖాదులతోఁ జెప్పుము.

ద్వా—చిత్తము మహాప్రభూ! (నిష్క్రమించును.)

[తెరయెత్తగాఁ వివాహాలంకృత వేషములతో నుత్తరాభిమన్యులు
పెండ్లిపీటపైని, కేశవశర్మ ప్రవేశింతురు.]

కేశ—అయం ముహూర్త. స్సుముహూర్తోస్తు. ఆచమనం చెయ్యండి.
కేశవ, నారాయణ, మాధవ, వెన్నదొంగ, గోపికావస్త్రాపహర
రుక్మిణీవల్లభ, ద్వారకావాస, ప్రద్యుమ్నజనక, వనమాలాధర,
కటిబద్ధనోలూఖల, దైత్యసూదన, చక్రహస్తాయనమః, రాజీ
వనేత్ర, పన్నగశయన, పాపహరణ, దారిద్ర్యధ్వంసక, అక్రూ
రవరద, ఆపన్నివారణ పాండవరక్ష, నందకుమార, బ్రహ్మాండ
నాయక, అక్షయవస్త్రప్రధాన, లీలామానుషవిగ్రహ, శ్రీకృ
ష్ణాయనః అయ్యా! అక్షతలు వెనుక వేసుకొనండి, ముక్కు-
పట్టుకొనండి. "మమ" అనుకొనండి. శ్రీపరమేశ్వరప్రీత్యర్థం

ఉత్తరతో వివాహంకరిష్యే, చెంబులో వ్రేలుముంచండి. (విరటునిజూచి) మహాప్రభూ! తెరసిల్లాలు తెప్పింపుడు. (అని తెర బట్టించి) మహాసంకల్పమువినండి. మహారాజా! అస్యశ్రీజార్జి మహాపురుషస్య, సప్తసముద్రపరివేష్టిభూమండలస్య, మహాద్వీపశిధ్రిమహారాణానామనేక కోటదేశావృతేస్మిన్ బ్రిహ్మాండైర్గో పాఖండ పశ్చిమద్వీపే లండన్ నామపురీవిరాజితే, అధోమార్గ, భూమార్గ, వ్యోమమార్గసంచార జనసమాకీర్ణే, వివిధదేశాయాత రాయభారి, పరివృతే, జర్మనీ, ఇటలీ, రుష్యా, ప్రాంసు, తుర్కీ, చీనాజపాను, అమెరికా, అరేబియా, యీజిప్టు, హిందూవగైరా ఖండయోర్మధ్యే, విలియమూల్బట్టు. విక్టోరియా, యెడ్వర్డ్సుచక్రవర్తిరధిష్టితే, అక్స్ఫర్డు, ఎడింబర్గు, మాంచెస్టర్, స్కాట్లాండు, ఐర్లాండు, స్విటజర్లాండు, సెంటు పీటర్సుబర్గు, వేల్సుయిత్యాద్యనేక దేశసమాకీర్ణవిశేషవిరాజితే, అనేకవిధద్రవ్యాకర్షణవిలాసమహాయాత్రినిర్మాణ నిపుణనివాస యోగ్యగగనచుంబిత సౌధపరివృతే, అస్మిన్వర్తమానస్యవహారి కపబాణమాన వికటికయబ్ధే ఐరోపాఖండే, శ్వేతద్వీపే, శుభతిథే శుభదినే, శోణసముద్రరేణుకాభిస్సప్తర్షిమండలపర్యంతం కృదాశేద్యపాతసానే ఏకైక రేణుకాపకర్షక్రమేణ సర్వరాశ్యపకర్షణకాలే శ్వేత ద్వీపేనివాస సిథ్యర్థం, ధూమశకటయాత్రి సంజనితపరమాణుభిస్సూర్యమండలపర్యంతం ఏకైక పరమాణాపకర్షక్రమేణ సర్వరాశ్యపకర్షణకాలేవప్రభు అనుగ్రహాసిద్ధ్యర్థం ఉన్నతోద్యోగ ఫలావాప్త్యర్థం, అనేకయోగ్యతాపత్రిసిద్ధ్యర్థం మయూనవా అధికారిదయాసిద్ధ్యర్థం అస్మిన్ నాటకశాలామధ్యే శ్రీకృష్ణభగవాన్సన్నిధి ఉత్తరాకన్యాదానం మహం కరిష్యే. (పెండ్లి జరుగును.)

కృష్ణ—ధర్మజా! కన్నులపండువుగ నుత్తరాభిమన్యుల వివాహము గాంచితిమి. నీకోరికలన్నియు బూర్తియైనవి. ఇంకేమికావలయు.

ధర్మ—మహాత్మా! సర్వము సంపూర్ణమైనది.

గీ. ధరణి యీతిబాధలు లేక । దనరుగాత!
ప్రజల కన్యోన్యవైరముల్ । సమయుగాత!
ఖలుల కవమానయోజనల్ । సమయుగాత!
దేవ! వాసుదేవ! మురారి! । దీనరక్ష!

కృ—తథాస్తు.

ఇది శ్రీసుందరరామ కరుణాకటాక్ష సరసకవిత్వధురీణ
శౌనకగోత్రపవిత్ర చెఱుకుపల్లివంశ రాకాసుధాకర
కృష్ణయార్య తనూభవ వేంకటరామయ
నామధేయ ప్రణీతంబైన పాండ
వాజ్ఞాతవాసం బను దృశ్య
ప్రబంధంబున
సర్వంబును
సప్తమాంకం.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B192 |
| పుస్తకం పేరు | పాండవాజ్ఞాతవాసము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |